శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# తిరుమంగయాళ్వార్ చరిత్ర,

పీఠిక.

శ్రీగోలకొండనగరియనంబరగు
హయిదరాబాదదకనురాజధానియందు
నివసించెడు
శ్రీమత్సకలకవిజనదాసానదాసుండగు
తాడిపత్రి - లక్ష్మణదాసను, రజాఅల్లి - లక్ష్మణరాయండను,
నామంబులచేబరగుచుండెడు భగవద్భక్తునివలన
భాగవతపురాణోక్త
తిరుమంగయాళ్వారుచరిత్రంబు - యక్షగానంబుగా
రచియింపబడియె.

చెన్నపట్టణములో స్థాపించియుండెడు,
పా॥ కొమారయ్యగారి జ్యేష్ఠకుమారుడగు
పా॥ సోమయ్యగారి ఆదికళానిధియందచ్చువేయించి,
ప్రకటింపబడియె.

౧౮౮౭ సం॥ అక్టోబరు నెల ౪ తేది.



శ్రీ







శ్రీమతేరామానుజాయనమః.

శ్రీ లక్ష్మీ నృ సిం హ్వా య న మః.

# తిరుమంగయాళ్వార్ చరిత్రము,

# యక్ష గానము.

శ్రీవాణీశసురేంద్రముఖ్యసుఘనశ్రేణుల్ ప్రకీర్తింపస। ద్భావంబే ర్పడలోకముల్ గనుచుసీతారామసత్పట్టణేం। ద్రావాసస్థితినాత్మనుల్లసిలుసీతానాథుడెల్లప్పుడున్। ప్రావీణ్యంబునబ్రోచుమమ్ముపటువాక్ప్రౌఢిత్వ సంపాదియై॥



వినాయకప్రార్థన. దర్వు - నాటరాగం - ఆదితాళం.

నమామ్యహం గణనాయకం - హృదినమామ్యహం గణనాయకం॥

ప॥ అ॥ ఉమాసుతంమునిసమాజవినుతంప్రమోదకారణదుమోఘవరదం॥

నమో॥ ౧॥ కళామయంమంగళాలయంశసి - కళాధరం - మండలీశవ యం॥ నమో॥ ౧॥ సురాసురార్చితమరాతిదమనం - కరీంద్రముఖ మంత రాయశమనం॥ నమో॥ ౨॥ ప్రణామకృతలక్ష్మణాఖ్యరథా- చణంవిరాజ ద్ఘృణాకరంత్వాం॥ నమో॥ ౩॥



సరస్వతి ప్రార్థన.

దర్వు-భైరవిరాగం- ఆదితాళం.

కరుణించుమమ్మా- యీతరినిపల్కా-లకొమ్మ- కరుణించుమమ్మా॥ప॥ అరమరలేలనీయడుగులెనమ్మితినమ్మ॥ కరుణించు ॥ ఉ ॥ సరసీజపాణిఓ- నిరుపమకీరవాణి - సరసిజభవునిరాణీ - పరమకల్యాణివాణి॥ కరు॥౧॥

పరమపవిత్రాభా- సురతరసచ్చారిత్రా. నిరతముభక్తజనుల. నరసికృపాజూడుమమ్మా॥ కరు॥ ౨॥

ప్రాకటశీలానే- నీపమ్రొక్కెనుచాల- జోకతోడూతవేగా - లోకజననిలక్ష్మణుబాని॥ కరు॥ ౩॥

త్రిమూర్తిప్రముఖదేవతాప్రార్థన.

తరల॥ శతధృతిప్రసవాయుధాహితచక్రిశక్రతమస్వినీ । పతిదివాకరముఖ్యసర్వసుపర్వులన్భజియించిన । తత్కృతులువేలుపుబాసతోరచియించిమించుమహాత్ములన్ । మతి దలంచెద నమరప్రముఖుల నా పరాశరనందనున్॥

వ॥ యివ్విధంబుననిష్టదేవతావందనంబును ప్రాచీనకవి కవితాభినందనంబునుంగావించి కృతినాయకుండగు సీతారామపుర నివాసుండగు|శ్రీ సీతారామచంద్రునకు షష్ఠ్యంతంబుజప్పెదనెట్లని నా॥

దర్వు- రాగంసావేరి- తాళంజంపె.

శ్రీరాజవనిజా హృదయాబ్జమిత్రునకు- శైరిజైత్రునకుపావనచరిత్రునకుᳲ॥౧॥

మానిమందారునకుమహితమణిహారునకు- దానవవిదారునకుధరసుధీరునకుᳲ॥౨॥

సురచిరోల్లాసునకు శుభకరవిలాసునకు-ధరణిసీతారామపురనివాసునకుᳲ॥౩॥

వ॥సమర్పణంబుగానాయొనర్పంబూనిన భార్గవ పురాణోక్తతిరుమంగ యాళ్వారుచరిత్రంబను యక్షగానంబునకు కథాక్రమం బెట్టిదనినా॥

కథాప్రారంభము.

మ॥ రమణీయ్యంబగునైమిశాహ్వయమహారణ్యంబునᳲశౌనకా। ది మహాషిᳲప్రకరంబుదన్నడిగినᳲదిర్మంగయాళ్వారుయు। త్తము చారిత్రము చెప్పగాదొడగె మోదంబాత్మనుప్పొంగనీ। మునᳲవ్యాసమహాషిᳲచంద్రమపదపద్మధ్యానపారీణుడై॥

భటుని వేషంకథ.

దర్వు- పంతవరాళిరాగం- జలుపతాళం.

చండుడనేనుభటుడచూడుడీ - యోజనములారనిండుభక్తిసభనునిలువుడీ॥ ప॥ దండిగతిరుమంగయాళ్వార్ దండజేరి యుండువాడ - గండుమీరినట్టిజనులగుండెలదర జేయువాడ॥ చండు॥౧॥

వన్నెకాండ్లలోనమేటిగా - పేరెక్కి ఘనత -నున్నధీరలలోనసాటిగా - చెన్నుమీరిసకలజనులుమన్ననలతోసంస్తుతింప - మన్నె మంగయాళ్వారుమున్నుగానుబంపబడిన॥చండు॥౨ ॥

మరియొకింతరద్దిసేయకా - కొలువుండిమీరు - సరిగనిలువుదండబా యకా - వరమగుచులక్ష్మణాఖ్యునరసికరుణతోడబ్రోచు - ధరణిసీతా భిరామ పురవిహారిశౌరిగొల్చు॥ చండుడనేడు॥ ౩॥

సంధి॥ వినరయ్యసభికులార యీరీతి చడ్డభటుల చూడలేరు మంచి భటులజూచినాము కనక-నీరాకడకు కారణంబెద్దియొ సవిస్తారముగాశల విప్పవయా భటుడా॥

మాట- అదేరీతిచెప్పెదవినరామూర్ఖ॥

హాస్యం- మహామంచిదిస్వామి॥

ద్వి॥ వినరయ్యచెప్పెదవివరంబుగాను- ననఘుడౌతిరుమంగయాళ్వా రులనేడు - పరమభక్తునకేనుబంటనయ్యుండి - నిరతంబుపనులెల్ల నెరవే ర్చుచుందు - చండుడనాపేరుజగతిలోపలాను - దండివైరులకెల్ల దండధ రుండ - వచ్చినకార్యంబువరుసతోమీకు - జచ్చెరవినుపింతుశీఘ్రంబుగా ను - తిరుమంగయాళ్వారుతేజంబుతోడ - కరమర్థిసభజేయ గాగోరి నన్ను -బంపగావచ్చితిపనులెల్లదీర్ప - సొంపుగాకొలువుకు సుస్థిరముగ ను - లక్ష్మీశుపదభక్తిలాలితుడైన - లక్ష్మణదాసుకుల్లాసంబుసేయ - పుడ మిసీతారామపురవరుకృపను - కడువేడ్క-సభజూడగల్గునుశిరులూ ॥

సంధి-వ॥ తిరుమంగయాళ్వారులవారుకొలువుకూటమునకు విజయం చేస్తారు గనక- యీవజ్జనులుతమతమ కార్యకరులయందు జాగ్రతగాప్ర వర్తించుకొరకై తెలియపరచవచ్చినానురాద్వారపాలకా॥

హాశ్యం॥ అయితేస్వామిశీఘ్రముగా ఆళ్వారయ్యను సభకుతోడ్కొ ని రావలయును॥

శా॥ యీరీతిన్సభవారికెల్లవినయంబేపారగాబల్క-బ ।ల్మాగుంగాం చనవేత్రహస్తుడగుచున్మహాద్వ్యస్థతింమించిదా । నారూఢస్థితి నెల్లకార్య ములచందంబుల్నిరూపించిశీ । ఘ్రారంభుండగుచేగిదెల్పెదగనెయ్యంబొ ప్పదానంతయున్॥

సంధి॥ యీరీతిభటుడు కొలువుకూటంబునకు దయసేయుమని విన్న వించిన తిరుమంగయాళ్వారులు వచ్చుక్రమంబెట్టిదనినా॥



తిరుమంగయాళ్వార్ల వేషంకథ.

దరువు- మధ్యమావతి రాగం- ఆదితాళం.

వరతిరుమంగయ్యాళ్వారులను - శ్రీరంగమునందు - వరతిరు మంగయ్యాళ్వారులను॥ ప॥ అరమరలేకను తిరుమంత్రముమదిని నిరతము మరువక సురుతుగనిల్పిన॥ వర॥

అడయాడవైష్ణవరాజికేను- రంగేశునితిరు - వడిఘల్ ముదమొందగ సేవించెదను - కడువేడుకహరికడియందాసుడ - జడుడ పాతకుడ చంచలాత్ముడను॥వరతిరు॥౧॥

ఛప్పన్నరాష్ట్రములను పేరైనా - చోళా రాష్ట్రమున - యొప్పైనవాలినగరములోనా- యప్పుడుశూరులుతప్పకగొలువగ - మెప్పుగపాలెము మేటిమన్నెయను॥ వరతిరు॥౨॥

సా రెకులక్ష్మణదాసుబ్రోచు- సీతాపతినగర - వారిజాక్షూని వేగజూ చు- కోరికతోనిట గుసుతుగవచ్చిన- తీరుదెలిపెదను తిరముగవినుడీ॥ వరతిరు॥ ౩॥

సంధి-హాస్యం॥అయితేస్వామిమీరు తిర్రిమంగయ్యగారైతే తిరు ప్యానికి పోకయిక్కడికిరా కారణమేమి మీరుయింతమందివున్నారుమీ కులమేమి స్తళమేమి పుట్టుపూర్వం సవిస్తారం ఆనతివ్వ రయా ఆ ళ్వారయ్యా॥

మాట - అరీతేసవిస్తారంచప్పుతానువినరామూఢుడా॥

విష్ణుదేవతాప్రార్ధన.

పంచచామరం॥ సరోజసంభవాభవాదిసర్వదేవవంద్య। శర్వరీచరా ళిబాహుగర్వవై భవాబ్ధిమందరా।హరీపురాణపూరుషామురారివారి జాక్షశ్రీ- వరావరాహరూపశ్రీనివాసవాసవానుజా॥

విష్వక్సేనప్రార్ధన-

మ॥ అనయంబుల్వినయంబుమీరపటుశౌర్యాయత్తతల్ శార్జ్గపా ణినయాజ్ఞల్శిరసావహించిజగముల్ నిర్మింపరక్షింపబెం। పనుకర్తృత్వ ముబూనుమానితగుణ భ్రాజిష్ణువై లోక్యపా । వనచామీకరవేత్రహ స్తుడనువిష్వక్సేనుగొల్తుల్మదిన్॥

సంధి-మాట- విన్నావురావోరి నాయొక్కయిష్టదేవతాప్రార్ధనచే సితిని నాకులము స్తళము యీసభకురాకడకుకారణము సవిస్తారముగా జప్పెదవినరా॥

హాస్యంమాట - మహాప్రసాదం ఆజ్ఞ సవిస్తారం వెళ్లబెట్ట వల యుస్వామి॥

సీ॥ రమణీయ్యసర్వసర్వంసహాలలనకునూపురంబరయవాలీపురంబు। చెలువుమీరగకలుములముద్దురాలికికాపురంబరయవాలీపురంబు । వరని య్యమహానియ్యవైభవాధఃకృతగోపురంబరయవాలీపురంబు । వరరత్న బహువిధవసుసమృద్ధులననలకాపురంబరయవాలీపురంబు। బ్రాహ్మణక్షత్ర

వైశ్యశూద్రప్రధాన। వర్ణసంస్థితపటుసౌధపటలచటుల। లలితమణిఘృణిరచనావిలాసకలిత। గోపురంబులదనరువాలీపురంబు॥

సంధి ॥ మానివాసస్థానముగు పాలెంపట్టు వాలీపురము యిటు వంటి శృంగారముల కాటపట్టైన పట్టణము రామూఖ్యుడా॥

మాట- యింకాజెప్పెదవినరా వేత్రహస్తా॥

కందార్థం.

ఆపురినెడబాయకకడు। ప్రాపుగనుండుదురు పరమ భాగవతుల్ విద్యా। పారగులతులితమతి। దీపితులై నెగడినట్టి - ద్విజవరు లెలమిన్- నిరతముజ్ఞానవిభవాముకలిమిన్॥ విజితేంద్రియులునగుచువిమలభావంబున నిజమూగతిరుమంత్రనిష్ఠచే వెలసిన॥ ద్విజవరులెలమిన్॥

మాట- యింకాజెప్పెదవినుము వేత్రహస్తా॥

హాశ్యం॥ ఆలాగేఆనతివ్వవలయుస్వామి॥

ద్వి॥ చెప్పెదవినరయ్యచెలువుమీరంగ - మెప్పుగామద్వృత్తి ముల్లాసమొదవ - ననువుగావైకుంఠనగరీశుడైన - వనజాక్షుశార్ఙ్గాంశవలననీభూమి - కార్తికశుక్లపక్షంబుననేను - కీర్తివహించిన కృత్తికయందు - జనియించితిచతుర్థజాతుండనగుచు - జననియుజనకుండుసదయులై పెంప - శస్త్రాస్త్రవిద్యయుసరవిగోకొక - శాస్త్రంబులనుపరిశ్రమచేసి మిగుల - జారుడనై యతిచాతుర్యమొప్ప - సారసనేత్రులసంగతిగూడి - విహరించునొకనాడువేడ్కతోడుతాను - బహుదినంబులువాలిపట్టణముందు - మన్నెసుల్తాననమహివాసికెక్క - పన్నగాజనులను పాలించుటకును- తడయకలక్ష్మణదాసునిబ్రోచు - పుడమిసీతారాము పురహరికరుణ - విభవంబుతోడుత వెలయుచునున్న-సభజూడవచ్చితిసరగుననిపుడు॥

సంధి॥ నాపేరుచెప్పెదవినరా వేత్రహస్తా॥

హాస్యం॥ మహాప్రసాదంమన్నెసుల్తానాహ్వాయ॥

దర్వు - శుద్ధకాంబోధి రాగం - ఆదితాళం.

ధీరుడనుపరకాలుడను రణశూరుడను వినరా - మిక్కిలి - జాగుడను బహుచోరుడను ప్రతివార - మందువైష్ణవులకు కోరి జేరి సేవసేయు॥ ధీరు॥

వ॥ మేలుగాతలితంత్రులిరువురు వాలిపురమందు - ప్రేమతో - నీలుడని నామంబునొసగిన-చాలఖ్యాతితో డజనుల నేలుచుందునగరమందు॥ధీరు॥౧॥

మెండుగామన్నీలకెల్లనుగుండెలదరగను - చోళ - మండలేశ్వరుచండశాసన-మండగానియునిండు వేడ్క-నుండియనులుగొన్నయిట్టి॥ధీరు॥౨

ప్రేమలక్ష్మణదాసు నేలుటకీమహిలోనా - వెలసిన - స్వామిసీతారామపురవర - ధాముమదినిగొలుచువిష్ణుదాసుడనగవాసిగన్న॥ధీరుడను॥ ౩॥

హాస్యం॥ వో హూరాజాగ్రణి మీవచనములుసర్వాబద్ధములు అదియేలాగంటె పరకాలుడనిచిన్నదివెళ్లబెట్టితిరి మొదలు పొడుగుజెప్పినదిదాచిపెట్టితిరి యీసందేహం నివారణ సేయవలయు స్వామి॥

తిరు॥ అపచారములు సంభవించీని అపశబ్దముల అపహాస్యంచాయ కూడమరావోరి॥

హాశ్యం॥ అయితే దాసితప్పుతమించి అబద్ధమాడక నిబద్ధిపలుకవయ్యాపరకాలుడా॥

వ॥తిరు॥ వినరా వేత్రహస్తా నీలుడను నామంబుజననీజనకుల జననకాలమందు నిర్ణయించినదైయున్నది తమపరిచోళరాజ మండలేశ్వరుయనుగ్రహంబున పరకాలుండను నామంబు పౌరుషనామంబై లభించినది మొదలుజప్పిన తిరుమంగయాళ్వారులను నామంబు శ్రీమన్నారాయణ భక్తిజ్ఞానవైరాగ్యములవలన శ్రీవైష్ణవకైంకర్యప్రభావంబువలన పన్నిద్దర్వాళ్వారులలోగణనకెక్కి శ్రీరంగనాయకుల అనుగ్రహంబున ప్రసిద్ధికల్గినదిరా వేత్రహస్తా॥

హాశ్యం॥ స్వామి-మీరువక్క రేఅసితలచియుంటిని మీజతకు యింకాపదకొండుమందివున్నారని ఆనతిస్తిరి వారెవ్వరో శలవివ్వవలయు నీలాహ్వయా॥

మాట॥ ఆలాగెచెప్పెదవినరా॥

సీసార్ధం॥ పొయ్గైయాళ్వారునుభూదత్తాళ్వారును పేయాళ్వారులకుశ్రవణాఖ్యతార । నమ్మాళువారుతిరునక్షత్రమువిశాఖ వరమధురకవియాళ్వారులకుచిత్త । భక్తితోతొండరడిప్పొడియాళ్వారులకు జ్యేష్ఠ కూరత్తాళ్వారులకుహస్త । వరతిరుప్పాణాళ్వార్లకురోహిణి లలితిరుమళిసెయాళ్వార్లకుమఘ । వసుధపైకులశేఖరాళ్వారులకును । వర పునర్వసునక్షత్రమురసిచూడ । జగతినాపెరియాళ్వార్లుకు స్వాతితార । యనగనాళ్వార్లక్రమమీదియవనిలోనా॥ వీనూడిమీరు - సముధీకముదముతోనా - రమణాతోపన్నిద్దరాళ్వారులైరినాతో - తమిమీరమచ్చారిత్రమమరావినుపింతుమీకు - క్రమమీదియవనిలోనా - వీనూడిమీరు - సముధీకముదముతోనా॥

హాశ్యం॥ వోహోస్వామి బదరుకోటచాంతాడువలె చవిటివానిముందర శంకముపట్టినట్టు పాడితె నాకు తెలియను వొకరొకరిపేరు విడతీశి వారివారి జన్మనక్షత్రముల యుక్తముగా ఆనతివ్వవలయుస్వామి॥

సంధి॥ ఆలాగెచెప్పెదవినరావేత్రహస్తా॥


పొయ్గైయాళ్వార్లు.

క॥ శ్రీమత్పొయ్గైయాళ్వారులు। ధీమహితుడు దేవదేవుతిరువడిఘులు మోఘూమోదముతోగొలువగ। నీమహిశ్రవణమునసుదయించిరి వేడ్క౯ ॥౧॥


భూదత్తాళ్వర్లు.

క॥ భువిభూదత్తాళ్వారు౯। ద్భవమొందిరి ద్రావిడప్రబంధాఖ్యుండై। శ్ర
వణాఖ్యతారసుజన। స్తవనీయుండగుచుపరమతాపసవృత్తి౯॥౨॥


పేయాళ్వర్లు.

క॥ పెయ్యాళ్వారులుసుజనులు, వెయ్యారువిధములబొగడ వేడుకతోడ౯।
జియ్యారుతిరువడిఘల్ మది।నియ్యకొలిపిశ్రవణమందు నెలమిజనించె౯॥౩॥



నమ్మాళ్వార్లు.

క॥ నమ్మాళువారులఖిలజ । నమ్ములకునుసమ్మతముగనలరువిశాఖన్। గమ్మ
విల్తుగురుపదవన । జమ్ములకునుదాసుడగుచుజనియించెధరన్॥౪॥



మధురకవియాళ్వార్లు

క॥ మధురకవియాళువారులు। నధికవ్రతశీలుడగుచునచ్యుతదాస । ప్రథి
తుండైబహువిధముల । బుధతాననచిత్తయందుబుట్టెన్ధరణిన్॥౫॥



తొండరడిప్పొడి

క॥ తొండరడిప్పొడియాళ్వా । ర్నిండుమదిఁ జక్రిభక్తినిపుణుండగుచుఁ ।
దండిగనంతశత్రుల । గండడఁచెను జ్యేష్ఠతారకా జనితుండై ॥ ౬ ॥



కూరత్తాళ్వార్లు.

క॥ కూరత్తాళ్వారులుసొం । పారగహస్తాఖ్యతారఁగయందునపటువి। ద్యా
గ[illegible]మునఁ వెలసెను । దారతపోనియమయమవిధానాదులచేఁ ॥ ౭



తిరుప్పాణాళ్వార్లు.

క॥ తిరుప్పాణాళ్వారులుహరి । తిరువడిఘులుగొలువనతులధీవిలసితుడై।
గురుతరమగురోహిణియన్ । తిరునక్షత్రంబునందు దితుడయ్యెధరన్॥ ౮॥



కులశేఖరాళ్వార్లు.

క॥ ధారుణికులశేఖరయా। ళ్వారులుజన్మించిరధికలావణ్యకళా। సార
[illegible]ాతిశయములు। నారూఢిగవినుముఘనపునర్వసుతారన్॥ ౯॥



తిరుమళిశైయాళ్వార్లు.

క॥ తిరుమళిశేయాళ్వారులు। సరసతముఖతారయందుజనియించిమహిన్।
హరితిరువడిఘలునిలుపుచు।పరగెన్ధరలోనమిగులప్రాభవయుక్తిన్॥౧౦



పెరియాళ్వార్లు

క॥ పెరియాళ్వారులుస్వాతిని।నరుదుగజనియించిసత్కళాంచితుడగుచున్
ధరలోనువాసికెక్కెను। కరివరదునిభక్తసమితిఘనుడనిపొగడన్॥౧౧॥

సంధి॥ ఆహా వేత్రహస్తా నాతోవన్నిద్దరాళ్వారులజననక్రమంబు తెలియ పరిచితిని మామతోద్ధారులక్రమంవినుపించెదవినరా॥

హాశ్యం॥ అయితేస్వామి యింకాయవ్వ రెవ్వరువున్నారో సవిస్తారంశల విప్ప వలయుస్వామి॥

సంధి॥ ఆలాగేచెప్పెదవినరా వేత్రహస్తా॥



యెంబెరుమానార్లు.

కందార్థం.

ధరయంబెరుమానార్లని । కరమరుదారంగభాష్య కారులనంగా వరరామానుజులనసు । స్థిరముగనార్ద్రక్షయందు - ధీవిల సితు డై - జనియించెప్ర - భావసహితుడై - శ్రీవిలసితుడై విశిష్టాద్వై తస - ద్భావనచేమతోద్ధారుడై యతిరాజు ॥ ధీవిలసితుడై - జని యించెప్రభావసహితుడై॥



శ్రీమణవాళమహామునులు.

క॥ ఘనుడగుమనవాళ్లమహా। మునిమూలనుజనులకెల్లమోదావహుడై।
జనియించిఘనతకెక్కెను। వనజాక్షుని పాదభక్తి పరుడనజగతిన్॥



సేనముదలియార్.

క॥ సేనముదలియాళ్వారులు। భూనుతముగబొగడుగనగబొడమెనువిష్వ।
క్సేనుడనసౌజ్ఞవెలయగ। మానుగహరిపాదభక్తిమహితుడనగుచున్॥

హాశ్యం॥స్వామిమీరు పన్నిద్దరాళ్వారులక్రమం మీ మతోద్ధారుల పుట్టు పూర్వం మీరుశుభాశుభములకు ఆచరించే విష్వక్సేనులవారిజననం విని బహుఆనందమాయను మీరుసభకు దయచాయగలరనికోరి అనేకజనులు ద్వారంకాచియున్నారుకన్క శీఘ్రముగాకొలువుకూటమునకు విజయంచేయవలయుస్వామి॥

వ॥ యీరీతి వేత్రహస్తుండు విన్నవించిన పరకాలుండు పరమానంద భరితుండై సభాస్థలంబుప్రవేశించి గద్దియమీదకూర్చున్నయడ వేత్ర హస్తుండు కైవారంబుసేయుక్రమంబెట్టిదనినా॥

వేత్రహస్తుని కైవారం.

చోళరాజసేనాధ్యక్షాపరాకు॥

వాలీపురాధీశ్వరాపరాకు॥

మన్నెసుల్తానుపరకాలుబహాదరాహ్వాయపరాకు॥

అవక్రపరాక్రమధురంధరాపరాకు॥

పరమభాగవతకైంకర్యతత్పరాపరాకు॥

వ॥సంధి॥యీరీతి వేత్రహస్తులు కైవారంబుసేయ నటవిటగాయకపండిత దండనాయక ప్రముఖ సకలపరివారసహింతుండై యాఖండలవిభవంబుతోనిండుకొలువైయుండిమంత్రినిరావించి యిట్లనియె॥

తి॥ ఓ సుబుద్ధిమంత్రి॥

మం॥ యేమి రాజాహ్వాయ॥

తి॥ మనరాష్ట్రింబున సకలజనంబులు జారచోరాది భయ రహితులైసుఖంబులువడయుచు తమతమవర్ణాశ్రమధర్మంబులు తప్పకవర్తింపుచున్నారుగదా॥

మం॥ స్వామిసకలజనంబులు వికలంబునొందక సుకరంబులగు బంధు భృత్యాదినికరంబులతో సౌఖ్యమందుచున్నారుస్వామి॥



తి॥ ఓయిమంత్రి నాకు జారుడనే పేరువచ్చినది వివాహం లేనిదియౌనా
మము రహితంగాముకన్య మంచివయోరూప లావణ్యంబుగల చిన్న
దాన్ని వెతికిచూచివచ్చేనిమిత్తం నాల్గుదిక్కుల నల్గురుచారుల బంప
వలయు కావుననల్గురు మంచిప్రజ్ఞావంతులయినవార్ని పిలువనంపు
మిమంత్రీ॥

మం॥ మహాప్రసాదంస్వామి॥

గీ॥ నీటిలోజాడతియ్యంగ నేటియితడు । చండుడను పేర బరగును జగతిలోన । నీటిపైజాడదీయును పాటవమున । నిండుసాహస శాలి ప్రచండుడితడు॥

గీ॥ దండివిక్రమధుర్యండుదండుడితడు । భూమిలోపల జాడలింపొసగదీయు । మింటిపైజాడదియ్యంగదంటయితడు। గండుమిగిలిన జాణయుద్దండుడరయా॥

సంధి॥ యీరీతి నల్గురుభటులరావించి రాజాజ్ఞ దెలియ పరచిన భటులు మంత్రియాజ్ఞ వడశి సవినయంబుగా రాజుకుదండప్రణామంబులాచరించి నిటలతట ఘటితాంజలులై నిలిచియున్న భటులంజూచి మన్నెధీర వారలతోనిట్లనియె॥

తి॥ ఓభటులారా॥

భ॥ మంచిబుద్ధిస్వామి॥

తి॥ నామనంబునఘనంబుగా వివాహేచ్ఛకలిగి యున్నదిగనుక సకలదేశంబులరశి సౌందర్యకన్యకామణిని విచారించివచ్చిన బహుమానంబు జేశెద శీఘ్రముగా వెళ్లవలయుభటులారా॥

భ॥ మహాప్రసాదంస్వామి॥

దర్వు - సౌరాష్ట్రరాగం- ఆదితాళం॥

తరలీరిభటులూ - వేవేగామే - తరలీరిభటులూ॥ ప॥ తరలీరి భటులెంతోమురయూచుదేశాము- లరయాగపతియాజ్ఞ శిరమూలధరియించి॥తర॥

పారశీకమరాటపాండ్రనేపాళాంధ్ర - సూరసేనమగధ చోళ దేశములరయ॥౧॥

గాంధారకర్ణాటకాశ్మీరకోసల - సింధు కేరళద్రవిడ ఛేదిదేశములరయ॥తర॥ ౨॥

వంగావిదేహాంగవరపుళిందలలాట - బంగాళ సింహళ - బాహ్లీకములజూడ॥ తర॥ ౩॥

కొంకణకుంతలకురుగఘూర్జరమత్స్యటంకణరాష్ట్రముల్ పొంకాముతోనరయ॥ తర॥ ౪॥

ప్రేమలక్ష్మణదాసు నేమారకనుబ్రోచు - స్వామిసీతారామ సత్పురీశునిద లచి॥ తరలిరి॥ ౫॥

వ॥ యీరీతి భటులుచటులగతి నలుదిక్కులకుం జని రాష్ట్రంబులు పురంబులు పల్లెలు సకలభూమండలంబున గలరాజ్యంబులు ప్రాక్పశ్చిమ ఉత్తర దక్షిణనైరుతి మొదలగు అష్టదిక్కులరశి మరల వాలీ పురంబున కరుగుదెంచి పరకాలునికి సాష్టాంగదండప్రణామంబులాచరించి చేతులుమొగిడిచియిట్లనివిన్నవించిరి॥

దండుని వాక్యం.

క॥ కరములుమొగిడిచిదండుడు। పరకాలునితోడవిన్నపముజేశెను నే। నరసితినుత్తరదిశనీ। సిరికిన్సరితరుణిగానసిద్ధముస్వామి॥

ఉద్దండునివాక్యం॥

క॥ దండములర్పించుచును। ద్దండాహ్వయభటుడు బలికె దగపశ్చిమది। క్మండలినినీకుదగు వే। దండగమన లేదటంచు దైన్యముతోడన్॥

ప్రచండుని వాక్యం.

క॥ అంతప్రచండుడుదీనా। స్వాంతముతో బలికెప్రాగ్దిశన్దీవిలస।త్కాంతామణి లేదరయగ।నంతయు వీక్షించి నాడనని దెల్పుటయున్॥

చండునివాక్యం.

ఉ॥ అయ్యెడచండనామకమహాభటుడొయ్యన నేగుదెంచితా। నెయ్యము మోదమున్దనరనీలునకంజలిజేసిబల్కెనో। యయ్య శుభాంగియైన నొకయంగనగంటినిదక్షిణాంశమా। యయ్యపదంబులానవినుమయ్యత దియ్యవిలాసవైఖరుల్॥

సంధి॥ వ॥ యీరీతిచండుండువిన్నవించిన నీలుండు పరమానంద భరితుండై చండునకు వస్త్రాభరణాదులొసంగి కన్యకా భిలషితుడై సౌందర్యంబువినగోరి వయోరూపలావణ్యంబు వివరించు మని బల్కనచండుండుయిట్లనియె॥

సీ॥ వెలలేనికళలీను చలువ్రానివలనైననెలలోసగంబు నెచ్చెలి మొగంబు। అందంపుచిందంపు చందంబులను గేరు పలుమారు చెలువారు గళముతీరు। పగడాలజగడాలనగజాలు బలుఠీవి యలతేనియలచాలి వెలదిమోవి। హారినీలరుచిజాలపరిహేలనతమించు సిరిగాంచువిలసించు కురులసంచు। కలికికనుడాలు నెన్నంగగండుమీలు।కులుకుకుచములులికుచముల్ కోమలికిని। నల్లచీమలబారు చెన్నాసునారు। పదములరవిందరుచులకాస్పదములనఘా॥

సం॥ ఓమహారాజ నలుమొగంబుల నలువకైన నాచెలువచలువంబెన్న నలవిగాదుగాననీకుతగినలలనామణి కావేరితీరంబున శ్రీరంగపట్టణంబునకుసమీపంబుగల తిరువాంగూరను వైష్ణవాగ్రహారంబుననుండియున్నదిగావున శీఘ్రముగా వివాహయత్నము సేయవలయు రాజాగ్రణీ॥

వ॥ యీరీతిచండుండు శుభవార్త దెలిపిన పులుకాంకురుండై కొలువుసాలించి చండునిసహాయంబుగా వాలిపురంబు వెడలి తిరువాంగూరుజారంజని కావేరిజలంబులగ్రుంకి శుచియై నూతనవస్త్రాభరణంబులు ధరించి కన్యకామణినివసించు తిరుమాళిఘకుజారంజని చండుని చే వైష్ణవాగ్రేసరు రావించిన వైష్ణవుండువచ్చు క్రమంబెట్టిదనినా॥



అయ్యవారు వేషం.

దరువు - జంఝూటిరాగం - ఏకతాళం.

రామానుజరామానుజరామానుజయనుడీ - వేమరుతిరుయతిరాజుల నామము చవిగొనుడీ॥రామా॥

తిరుమణితిరుచూర్ణంబులు గురుతుగధరియించి - తిరుమంత్రరహస్య
ద్వయ చరమార్థము లెంచీ॥ రామా॥౧॥
కరివరమనితిరువడిఘులుస్థిరముగమదినిల్పి - కరమొప్పగవైష్ణవకైంక
ర్యంబులుసల్పి॥ రామా॥౨॥
ధరలక్ష్మణదాసాహ్వయ పరిపాలకుడైనా - వరసీతాపతిపురహరి -
మరువకమదిలోనా॥ గామా॥౩॥



## దే వ తా స్త వం.

శ్రీమతేరామానుజాయనమః ॥ అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా మీనామంబు లనంతంబులట మీగుణంబులు వాఙ్మానసగోచరంబులట నిన్నుస్తుతింపనేనెంతటివాడ అదియట్లుండేని ద్రౌపది హాకృష్ణాద్వారకావాసయని మొరలిడినమాత్రాననే యక్షయవలువ లొసంగితిరి కుచేలుండు పిడికెడటుకులు సమర్పించినమాత్రాననే యలవిగాని పదవులొసంగితిరి కుబ్జగంధంబొసంగినమాత్రాననే దానివక్రత్వంబుమాన్పి గ్రక్కునజక్కఁ చేసితిరి మాలాకారుండు పూదండసమర్పించిమన్ననవడసె శతాపరాధుండ బహుపాతకుండ క్రూరుండ నన్నేతీరురక్షించిన నీవేరక్షించవలయు నమోనమో శ్రీవేంకటేశ్వరా॥



శ్లో॥ నమస్తేరంగనాథాయ రమాకాంతాయసర్వదా । శర్వాదిసర్వది
విష త్పరిషత్ప్రణుతాయతే॥

శ్లో॥ రాజీవాక్షుంకమలనిలయావక్త్రపద్మాబ్జమిత్రం । వాణీనాథప్రము
ఖసుమనశ్శ్చాతకప్రావృడభ్రం । నిత్యానందంమణిగణలసత్కోటి
కోటీరహారం । భావాతీతంమనసిసతతం రంగనాథంభజేహం॥

శ్రీమతేరామానుజాయనమః.

దర్బు - హిందుస్తానిరాగం.

మేరేధని రాముచందరుదూసరానహీరే -- దూసరానహీరేప్యారే -
దూసరానహీరే - మేరేధని రాముచందరుదూసరానహీరే॥ ప॥
నైసేధనీకైసేప్రభుకేసై సాహెబుమేరా - జైసెజోకోయిమాంగేధి
ల్ సేవై సేదేనేహారా - మేరేధని॥౧॥
షనుమేరామనామ ధరియొసునుహమారిబాత్ - దునియాజోకుచే
టాపో త్రాకోహినఅవేసాత్ - మేరే॥౨॥
సీతారామపురనివాసుసీతాపతిభజియొ - ఖ్యాతిలక్ష్మణదాసుకెవో
దాతలాగొసునియొ॥మెరేధన॥

హాశ్యం॥వోవైష్ణవోత్తను మీరెవ్వరు యిచ్చటికి వేంచేయుటకు కారణం బేమి సవిస్తారం తెలియచాయవలయు పరమభాగవతోత్తమా॥

వై॥ మాట॥ ఓభటుడ యేను శ్రీరంగపట్టణసమీపంబున కావేరి తీరంబున తిరువాంగూరను గ్రామంబున నుండెడు నారాయణాచార్యుల ను పేరబరగెడు వైష్ణవుండ పరకాలుండుదండుడనుభటునిమద్గృహంబునకు బంపిరప్పించిన కారణంబున వచ్చితిరా ద్వారపాలకా॥

ద్వార॥ అయితేస్వామి మామన్నెధొరపిలచిన మాట వాస్తవం మీకు కొమాళ్లు కొమార్తెలు యంతమందిసవిస్తారం తెలియచాయ వలయువైష్ణవోత్తమా॥

వై॥ మహామంచిదిచప్పెదవినరాభటుడా॥

సీ॥ వసుధలోపలతిరువాంగూర నెడుపేర నలరెడునొకయగ్రహారమందు। కాపురంబుండిభాగవతకైంకర్యంబులనుదినంబును సల్పనంతనొక్క నాడు కావేరిపుణ్యస్రవంతికిస్నానసంధ్యాదిసత్కర్మసమితిదీర్చ । నరిగియచ్చటకమలాలయనుబోలిన బాలికామణిగాంచిలాలితముగ। పెన్నిధానము గన్నట్టిపేదపగిది। పుత్రికాభావమునగృహమునకుదెచ్చి। యలమిబెనచితి వాబాలనిద్ధశీల। కుముదవల్లికయను పేరప్రమదమలరా॥

ఓభటుడ- నాకువకకుముదవల్లికయను పుత్రికగలదు మిగుల పుత్రులు పుత్రికలులేని కారణంబున మమతగాపెంచియున్నానురా భటుడా॥

భ॥ అయితేస్వామి వైష్ణవోత్తమ శీఘ్రముగామీద్వారంబు పంచటరుగులమీద కూర్చున్న పరకాలబహాదరు మన్నెసుల్తానుమీదర్శనాభిలషితుడై నిరీక్షిస్తున్నాడుగావున విజయంచేయవలయుస్వామి॥

వై॥ మహామంచిదిభటుడా॥

సంధి॥ వ॥ యీరీతిభటునిచేదెల్పబడి గృహద్వారంబుబైట దివాణంబున వైష్ణవోత్తముండు కూర్చుండిపరమభాగవతోత్తముండు మన్నెసుల్తాను తనగృహంబునకు రాకడకేమి కారణంబనివితర్కించు చున్న

సమయంబునపరకాలుండుదండుని సహితంబుగా దివాణంబునకుప్ర
వేశించివైష్ణవాగ్రేసరునిఁజూచివందనంబుసేయుక్రమం బెట్టిదనినా॥
క॥ వరతిరుమంగయాళ్వారును। పరమోత్సాహంబుతోడభాగవతాగ్రే।
సరువైష్ణవుగనియాయన। తిరువడిఘులకెరగె భక్తిదీపింపంగన్ ॥
గీ॥ చేరిమ్రొక్కినమంగయాళ్వారులకును।మహితవైష్ణవకైంకర్యము స్తటం
చు।మంగళాశాసనంబులొసగికుశల।మడిగెనాతనినధిక సౌహార్ద్ర మెసగ॥
వ॥ యిట్లునారాయణాచార్యుండుకుశలంబడిగిమంగళాశాసనంబు జేసినీలు
నికూర్చుండనియమించిన పరకాలుండు వైష్ణవానుమతంబుగా కూర్చుండియిట్లనియె.
గీ॥ స్వామిభవదియ్యమంగళాశాసనంబు। కతనమాకెల్ల శుభముసంత
తముమీకు। నిత్యకళ్యాణమేబంధు స్తుత్యయనుచు । సవినయంబుగబ
లుకనయ్యవసరమునా॥
సం॥ యీరీతిభాషించుచున్న యవసరంబున జనకుండు దివాణంబునవసి
యించు కారణంబున జనకుని దర్శనాభిలాషియైకుముదవల్లిజను దెం
చుక్రమంబెట్టిదనినా॥



లక్ష్మీదేవివేషం. రాగం-దర్బా- శుద్ధకాంబోధి.

వచ్చెనులక్ష్మీదేవివైకుంఠము వదలిముదంబుననూ- మచ్చికసఖియలు
ముచ్చటలాడగ - హెచ్చుగజనులకునిచ్చెదశివులని॥ వచ్చెను॥ప॥

నిరతముబాయకసురవనితామణులరుదుగగొలువగను - పరమోత్సా
హతసురవరులెల్లనువిరులనుగురియగను - పరిపరివిధములపన్నగకిన్న
రవరులుబాడనచ్చరలాడగనటు వచ్చెనులక్ష్మీదేవి॥ ౧॥
అతిముదమలరగహస్తకంకణములందెలుమ్రోయగనూ- చతురతవా
టిలసఖియలుదగవింజామరలేయగను- సతతముసీతాపతిపురనిలయుని
మతముబూనిసుర- తతులుబొగడగను॥ వచ్చెనులక్ష్మీ॥౨॥
సారెకుసురమునిసముదాయమువే సారకవేడగను - ధారుణిలక్ష్మణ
దాసునిబ్రోవను దారతవాటిలను- కోరికభక్తులకోరుకలొసంగు
చు- నేరుపుతోహరిజేరిభజింపగ॥వచ్చెనులక్ష్మీ॥ ౩॥

హాశ్యం॥ వోహొలక్ష్మీదేవి వైకుంఠం వదలియిచ్చటికి యాలవేంచేసి
తిరి సవిస్తారంఆనతివ్వవమ్మాకలుములకోమ్మా॥

ల॥ ఆలాగేచప్పెదవినరా ద్వారపాలకా॥

ద్వి॥ వినరయ్యచప్పెదవిశదంబుగాను - ఘనముగానాకలోకమునుం
డియేను - వచ్చితిభక్తులవరుసతోబ్రోవ - మచ్చికలలరంగ మహిమీదికప్పు
డు - చచ్చెరసకియలచనొ్నందవిడచి - యచ్చెరువుగబాలనయ్యాకావేరి-
తీరంబునందునతిన్నగానున్న - నారాయణాఖ్యచేనమరువైష్ణవుడు - కా
వేరినదిలోనకార్యముల్ దీర్ప - వేవేగవిచ్చెశివేడ్కతోజూచి - యిదియే
మిచోద్యమోయీవేళయందు - పదపడిశిశువీడపడియున్నదనుచు- చచ్చె
రగొనిసతిచేతికిప్రేమ - నిచ్చెనంతటనునాయిుందీవరాక్షి - పుత్రికాభావ
నపొలుపొందగాను- పుత్రులులేమినక్కాపోషించెవేడ్క- ప్రమదంబుతోమ
రుత్పదవాణిబలెక - కుముదవల్లికయంచుసవలయింబునను - నడియడౌ
లక్ష్మణాఖ్యావనుడైన- పుడమిసీతారామపురహరిజూడ - నేతెంచితిచట
కినెయ్యంబుమీర - ఖ్యాతినిచ్చెదసిరుల్ కడువేడ్కతోడ॥

దర్బు-పంతవరాళిరాగం.

సిరియటంద్రుమ వేడు-లలరగా- గొల్చెదరుజనులు పరమభక్తిరక్తిదన రగా॥ ప॥ ఉ॥ సరవిపచ్చవిల్లుగన్నసరసిజాక్షియనగభువిని - గరిమ దాసవరులకెల్లవరములొసగబూనినట్టి॥ సిరి॥

అగణితముగసురలుబొగడగా- దివినుండిదేవ- మృగధరాస్య లెలమి నాడగా- తొగలమగనిజిగినిదెగడు-నగు మొగమునమృగమదంబు- సొ గసుగులు- మిగులసోయగముమీరుసొరుగల్గు॥౧॥ సిరి॥

తారహారములువెలుంగగా - నవరత్నమం - జీరనాదములు జెలంగ గా- తోరపుఘనసారకాస్తూరిమిళితలలితపా - టీరఘుమఘుమాయ మానసారబాహ్యచర్చ-లలర॥ సిరి॥ ౨॥

కలికిచూపుకనుములీనగా - మదిలోననమ్మి- కొలుచువారలెలమిబూ నగా- చెలగిలక్ష్మణాఖ్యహృదయజలజవాసుడగుచు నెపుడు - నలరుసీ తాభిరామనగరనిలయుహృదివసించు॥ సిరి॥ ౩॥

హాశ్యం॥ఓకుముదవల్లినాంచారు మీజనకుండగు నారాయణాచార్యుం డు దివాణంబునవేంచేసియున్నాడు గావున శీఘ్రముగా జనకు ని సన్నిధానంబునకుదయసేయవమ్మాబంగారుబొమ్మా॥

వ॥ యీరీతిభటునిచే దెలియంబడి కుముదవల్లిక జనకునిసన్నిధానం నకుచేరంజని యిట్లనియె॥

క॥ దండముభాగవతోత్తమ। దండముశ్రీరంగభక్తితత్పరచిత్తా । దండము వైష్ణవసత్తమ । దండంబాచార్యవర్యదండముతండ్రీ॥

నా॥గీ॥ మంగళాశాసనమునీకుమాన్యచరిత । మంగళాశాసనమునీకుమం దయాన। మంగళాశాసనమునీకుమధురవాణి । మంగళాశాసనము నీకుమణికలాపా॥

వ॥ మరియును॥

క॥ వర్ధిల్లుబాలికామణి । వర్ధిల్లుముచంద్రవదనవరగుణసదనా। వర్ధిల్లుముసుత్పుత్రిక । వర్ధిల్లుముకుముదవల్లి వర్ధిలుతల్లీ॥

సంధి - వ॥ యీరీతిమంగళాశాసనంబుచేసి దిగ్గునలేచి చేరందిగిచి పరమాహ్లాదంబుచే నానందబాష్పంబులుగురియ క్షేమాతిశయంబులడిగి కూచుండనియమించిన జనకునియనుజ్ఞవడసి యథోచితస్థలంబునకూచున్న యవసరంబున నీలుండా కుముదవల్లిలావణ్య తారుణ్యవిలాసంబులకు నచ్చెరువందుచు మదనబాణబాధితుండై యప్పరమభాగవతోత్తమునకిట్లనియె॥

కందార్థం ॥ యీబాలనామణియవగని । వాలాయముతన్నునడుగవైష్ణవుడనేనీ। బాలామణిమత్పుత్రిక। ధీలాలితయగుచువసుమతిన్జనియించెన్॥ యోచననామ - తిన్గనుపించెన్ - కంజాక్షికెవ్వారుఘనుడు వరుండౌని - నంజలిగల్గెమానినిగూచిన్ యిదివసు - మతిన్జనించెన్ - యోచననామ - తిన్గనుపించెన్॥

కందార్థం॥ అనిపల్కినపరకాలుడు । మనమునసంతోషమొంది మహిమ్రొక్కగబో। యినదేవరయదురుగవ। చ్చినచందంబయ్యెనని విచిత్రముగాగన్॥ జెప్పెదవినుస్థిరమతి వేగన్ - పాత్రమునెంచిమీపుత్రినిమాకిమ్ము - ధాత్రిలోపలనుభయగోత్రాములలరు - విచిత్రాముగాగన్ - జెప్పెదవిను - స్థిరమతివేగన్॥

సంధి - వ॥ యీరీతిపరకాలుండుబల్కిన వైష్ణవోత్తముండు మన్నెసుల్తానుపలుకులకు ప్రతిబలుకజాలక విన్ననై తనభార్యామణినివిచారించి సముత్తరంబుతెలియసేయుచునని నీలునితోవిన్నవించి పుత్రికా సహితంబుగా గృహిణియగు ఆండాళువద్దికిజనిపరకాలుడుకోరినవాక్యంబు తెలియపరిచిన ఆండాళుయిట్లనియె॥

ద్వి॥ యిదియేమిచోద్యమోయీవ్యాళయందు - పదపడిశూద్రుండుప పురుషవృత్తి - వర్ణాశ్రమముదప్పివచియించుమాట । కర్ణకఠోరమైక

నుపించె నాకు - కావునకూడని కార్యంబు మిగుల - నీవు సేయగ నేలనీతిమా లిటుల - రాజై తెధర్మంబురక్షించ చాల - భూజనుల్ స్తుతియింపభువి నేల వలయు - కరుణలక్ష్మణదాసు గా చిరక్షించు - ధరణిసీతారామ పురహరి సాక్షి- యిచ్చుటపడదనియిప్పుడెపోయి - చెచ్చెరనీలుని చెవినాటబలుకు ॥

ఆం॥ వో ఆర్యవర్య మనవైష్ణవధర్మవొదలి శూద్రునికికన్యాదానం సేయుట కులహానిశాస్త్రవిరుద్ధమని తమకు తెలిశివుండి నన్నడుగ కారణంబేమి ప్రాణవల్లభా॥

నా॥ వో ప్రాణవల్లభి యీకన్యకామణి మనగర్భంబునజన్మించినది కాదు దయివీకృతంబుననమనకులభించినది యేజాతిఅయినది నిర్ణయించజాలను అయితే పరకాలుండుబలవంతుండు మనరాష్ట్రమునకు మన్నె సుల్తాను బలాత్కారంబున కన్యకామణిని గొనిచనిన నేనేమిసేయంగలవాడ యిందుల ఉపాయంబేమని చింతించుచున్న ప్రాణవల్లభి యిట్లనియె॥

ఆం॥ వో ప్రాణవల్లభ చింత సేయవలదు మీయిష్టానుసారంబుజరిగించుట హర్షంబుఅదియట్లుంటేని స్త్రీలకుపతియాజ్ఞ వదలి అన్యమార్గము నడుచుట పాతివ్రత్యదోషంబుసంభవించుగావున ఆలోచించవలదు ప్రాణవల్లభా॥

సంధి - వ॥ యీరీతి భార్యాభర్తలుయోచించుక పుత్రికసహితముగా దివాణంబుప్రవేశించిన పరకాలుండు దంప్తులకుదండప్రణామంబుచేశి కోరినధనంబిచ్చెద కన్యకామణి నిమ్మనిపలికిన దంప్తులు రాజభీతిచే యేమియుమారాడక నూరకున్న మణిమయాభరణాంబరాదులొసంగి కోరినధనంబిచ్చిన నప్పరమభాగవతశేఖరుండు కరంబుసంతసించి నిజభార్యానుమతంబున నకన్యకామణిని పరకాలునికివ్వనుద్యోగించుచున్నయవసరంబున లోకమాతయగు కుముదవల్లినాంచారు జననీజనకుల యభిప్రాయంబుగుర్తెరిగి జనకునితోనిట్లనియె॥

కు - ద్వి॥ ఓతండ్రివినుము నాదొక విన్నపంబు - ఖ్యాతిగావినుపింతుక డు ప్రేమతోడ - విష్ణుభక్తుల సేవ వేడ్కతో సేయు - వైష్ణవోత్తమునకు వైభవంబలర - నిల్లాలనయ్యెద నెలమితోడుతను - కల్లలు గావునికముగాగనమ్ము - తడయకలక్ష్మణదాసునిబ్రోచు - పుడమిసీతారామ పురహరిసాక్షి - చెప్పెడవినుముతచ్ఛీలంబులన్ని - యొప్పెద రేనియునొనరవరింతు॥

సంధి॥ యీరీతికుముదవల్లినాంచారు మేఘగంభీరంబులగు వాక్యంబులు బలికిన జననీజనకులు శిగ్గుచే నేమియుం బ్రతిబలుకజాలక నూరకున్న పరకాలుండు తద్భాషణంబులకు మదనబాణ పరవశుండై యిట్లనియె॥

దర్వు - అసావేరిరాగం.

చంచలాక్షిజూచిమనసుసంచలించెరా - మరులుచాలమించెరా ॥ప॥

కంచివరదరాజవేరెగతియుగానరా - నాపై- కరుణబూనరా ॥ ౧॥

కలికి పలుకు లమృతరసముగులుకుచుండురా- తేనె-లొలుకు చుండురా॥ చంచ॥౨॥

పంచశరునిబాధసైరించ రాదురా. అన్యా-మెంచా రాదురా॥ చం॥

దైవకృతము నేమనందుతాళజాలరా - యికను - తడవు లేలరా ॥

ప్రేమలక్ష్మణదాసుబ్రోచురాములానరా - మదినిచలమూమానరా॥చంచ॥౪॥

సీతారామపురనివాసు సేవజేసెదా - మది - చింతాబాసెదా॥ చంచ॥౬॥

సంధి॥ యీరీతిపరితపించుచు చండునిమొకంబు చూచియిట్లనియె॥

పర॥ ఓభటుడా॥

చం॥ యేమిరాజాగ్రణి॥

పర॥ యీచిన్నదినాకు తగినది తలిదండ్రులతో భాషించ టేమి కారణంబులేదు నేను కన్యకాలలామతో యోచిస్తాను భటుడా॥

చం॥ స్వామి ద్రవ్యం యిచ్చి కొన్నసొమ్ముకు స్వతంత్రులు మీరే మాట్లాడవచ్చును రాజా॥

వర॥ సంధి॥ యీరీతి నిశ్చయించి పరకాలుండు కుముద వల్లితో నిట్లనియె॥

క॥ అరుదుగ నాలక్షణములు । కర మొప్పగ నాకుజప్పగావలెననియా।తరుణీమణినడిగెను తా । పర మోత్సాహంబుతోడ భాసుర ఫణితిన్॥

మాట- ఓకుముదవల్లి ఆధర్మంబులెటువంటివో తెలియ బలుకవలయునిస్సందేహముగా నంగీకరించెదకుముదవల్లీ॥

మాట_ అదేరీతిచప్పతావినుమునీలనామధేయ॥

క॥ ఆతెరగంతయుజప్పెద । కౌతూహల మొప్పవినుము కల్మషవృత్తిన్। ఖ్యాతిగవరియించెదనని । యాతరుణీమణియనంగనౌగాకనుచున్ ॥

వ॥సంధి॥యీరీతికుముదవల్లి పలికిన పలుకులు శ్రవణామృతంబులై సోకినసీలుండు లక్ష్మీకటాక్షవీక్షణా ప్రభావంబున నీవేరీతి నాజ్ఞ యిచ్చిన నాప్రకారంబొనర్చెదనని ప్రమాణ పూర్వకంబుగా బలికినకుముదవల్లియిట్లనియె॥

ద్వి॥ వినరయాజెప్పెదవివరంబుదెలియ - ఘనముగానాసనక్రమములరీతి - ననువుగానెనబదినాల్గులక్షలను - పనుపడనాసనపద్ధతిగల్గు - నందులోనెనబదినాల్గాసనంబు - లందుప్రసిద్ధిమైనట్టియష్టాద - శాసనంబులలోన చతురాసనములు - భాసిల్లజెప్పెద పరగంగ వినుము - నందులో ముఖ్యసిద్ధాసనంబొకటి - సందియంబులు లేకజగతిప్రసిద్ధి - గావున వినుమింకకడు వేడ్క యోగ - భావనయష్టాంగపద్ధతులెల్ల - నభ్యసించగవలె నాచార్యకృపను - నభ్యులెన్నగనతిచాతుర్య మెసగ - ధరణి లక్ష్మణదాసు తప్పకబ్రోచు - సరవిసీతారామసత్పురవరుని - గురుతరభక్తి చేగురినిల్పిగొల్వ - స్థిరముగానిష్టార్థసిద్ధులుగల్గు॥

కు ॥ యింకా వైష్ణవధర్మంబులు జెప్పెదను మనోవికలంబు జెందక సావధానచిత్తుండవై విని ప్రత్యుత్తరంబులివ్వవలయు నీలనామధేయా॥

నీ॥ మహాత్ముంచిదికుముదవల్లిఆలాగేఆనతివ్వవలయును॥



కుముదవల్లినాంచారు నీలునిసంభాషణ.

దర్వు - తిరునామక్రమం.

ప॥ తిరుమంత్రముపఠియించెటివైష్ణవ తిరువడిఘుల్ గనిమ్రొక్క వలెఁ
పరమభాగవతసంగతి జేయుచుపరతత్వముగురు తెలుగవలెఁ॥తిరు॥౧

సీ॥ తిరుమంత్రముధరియించెటివైష్ణవతిరువడిగుల కేనడియడను - వరరా
మానుజభట్టరాద్యులకువందనములు నే జేసెదను॥తిరు॥౨॥
క॥ అష్టాక్షరిగురునాజ్ఞబూనిబహునిష్ఠతోడమదినెంచవలె - నిష్ఠురభా
షణదుష్టసంగతులు - నేరుపుతో వర్జించవలె॥ తిరు॥ ౩॥
సీ॥ కష్టమునకవినుమష్టాక్షరిగురు - కరుణతోటిసాధించెదను - యిష్టులైరి
శ్రీవైష్ణవులెల్లను నిహపరసాధనగాంచెదను॥తిరు॥౪॥
క॥ నూటయెనిమిదిదివ్యతిరుపతులు నూటితప్పకనుచూడవలె - బూటక
సంసారాంబుధిదాటెమాటగురునిచే నాటవలె॥ తిరు॥౫॥
సీ॥ మేటినూటయెనిమిదితిరుపతులను - పాటవమునసేవించెదను - నూటి
గ నేగురుకూటముచేరిపుకోటినెల్లనణగించెదను॥ తిరు॥౬॥
క॥ తులసిమాలికెలుగళమున వేసియు - సలలితముద్రలుదాల్చవలె - చె
లగుచు నేకాదసివ్రతములుదగ సేయుచుభక్తితోనుండవలె॥తిరు॥౭॥
సీ॥ హరివాసరములుతిరముగ సేయుచువరదరాజపురినుండెదను- మరువక
తులసీమాలికముద్రలుమురిపెముతోధరియించెదను॥తిరు॥ ౮॥
క॥ తిరుమణితిరుచూర్ణంబులుదాల్చే తీరుఘట్టిగాదెలియవలె- అరమ
రసేయకతిరువారాధననతివేడుకతోసల్పవలె॥తిరు॥౯॥
సీ॥ తిరుమణితిరుచూర్ణంబులంగమున తేజముమీరగ దాల్చెదను - తిరువ
డయూరికి నేగినంబిచే తీర్థప్రసాదముగొనియెదను॥తిరు॥ ౧౦ ॥
క॥ పంచేంద్రియములవంచనజేసియు చంచలబుద్ధినివిడువవలె - సంచి
తద్వయచరమార్థరహస్యము లెంచిబ్రహ్మమును గాంచవలె॥తిరు॥
సీ॥ చంచలమొందకపంచార్థరహస్యంబులుచక్కగ తెలిసెదను - మించి
వైష్ణవక్రమముల నెల్లను నెంచిబ్రహ్మమును గాంచెదను॥తిరు॥ ౧౨॥
క॥ కోరివిశిష్టాద్వైతక్రమముల నారూఢిగమది నరయవలె - సారెకు
వైష్ణవతదీయారాధన చక్కగనిత్యముసల్పవలె॥ తిరు॥ ౧౩॥
సీ॥ అనుదినమును నే తిరువారాధననతిభక్తితో గావించెదను - అనువుగవై
ష్ణవతదీయారాధనలనవరతంబును సల్పెదను॥తిరు॥౧౪॥

క॥ యంబెరుమానారాళ్వారాదుల నెలమిభక్తితో గొలువవలెా - శం
బరారిజనకుండగు శేషాచలపతి నెపుడు భజింపవలెా॥ తిరు॥౧౫॥
సీ॥ పతితపావనుని భక్తిజలంగెడు యతిరాజుల నేగొల్చెదను - సతతము శే
షాచలపతి నాము మెగతియనిభక్తి పఠించెదను॥ తిరు॥౧౬॥
క॥ మూడు నారువది నెనిమిది నెనిమిది మూలములను సాధించవలెా - నా
డిస్థానప్రణవనూగాా వములనరసి భక్తుడై వెలుగవలెా॥ తిరు॥ ౧౭॥
సీ॥ కామ మోహలోభాదుల నారిటికడు నేర్పునవజిాంచెదను - ఏమరువి
నుమష్టాంగయోగముల నెనిమిదిపది సాధించెదను॥ తిరు॥ ౧౮॥
క॥ మొన్నగలక్ష్మణదాసావనుడగు వెన్నునికన్నుల గానవలెా - పన్నగసీ
తారామపురీశప్రసన్నుడవగు మసివేడవలెా॥ తిరు॥ ౧౯॥
సీ॥ కరుణతో లక్ష్మణు గాచెడు శ్రీహరి మురయుచు మదిలోనుంచెదను - ధర
సీతాపతిపురరఘువీరునితిరువడిగుల్ మదిని ల్చెదను ॥ తిరు॥ ౨౦॥
సంధి॥ యీరీతికుముదవల్లియానతిచ్చిన పరకాలుండు చండునకు శలవి
చ్చివాలీపురంబునకు బనిపి యేకాంగియై వైష్ణవశీలంబులు నేర్చు
కొరకు శ్రీరంగంబునకు సమీపంబుననుండు తిరుకడయూరుజా
రంజని॥

సీసార్థాం॥ ఏవీధిజూచిన శ్రీవైష్ణవగ్రంథపారాయణముల చేబరగుదా
ని । నేవాడగనుగొన్న నెడపక భాగవతాహ్వానరవములనలరుదాని। నేమం
దిరముగన్న శ్రీమందిరముమాడ్కి- వివిధసంపదల చే వెలయుదాని । నే వేళ్ల
బొడగన్న శ్రీవల్లభాంకితగానప్రహతమృదంగములదాని । చారుపున్నాగ
ఖజూారనారికేళ । క్రముకముఖభూజరాజి చేనమరుదాని । లలితశుకపి
కరవములచెలగిశిరుల॥ మీరియలరారు - తిరువడయూరు చేరెనూ - న
చ్చోటనంబి - తిరుమాళికెలోదూరెను॥ ప॥ విరజాజిసురుపొన్నకురువక
కుందప్రముఖ - పరిమెళమిళితమైనవిరులతోటలుగల - తిరువడయూరు చే
రెనూ - నచ్చోటనంబి - తిరుమాళికెలోదూరెను॥

సంధి॥ పరకాలుండు యీరీతి తిరువడయూరుజారంజని నంబిగృహంబు ప్రవేశించి॥

కందార్థం॥ స్థిరమతినయ్యాచార్యుల । తిరువడిఘుల్ శరణమనుచు జేరితదంఘ్రుల్ । శిరముసోకంగ మ్రొక్కెను । నిరుపమభయభక్తులెనయనిపుణతతోడన్॥ తనమదిలోన - కపటంమువీడన్॥ చపలచిత్తుడజ్ఞుడసత్యవిరహితుడ - కృపనూడనన్నసత్కృపగావుమనుచును-నిపుణతతోడన్॥

సంధి॥ యీరీతిప్రార్థించి వందనంబాచరించి కరంబులుమొగిడిచి నిలుచున్న నీలునిపై నంబియనుగ్రహించి వైష్ణవధర్మంబు లుపదేసించి చక్రాంకితసంస్కారంబుచే పవిత్రుంజేసిశలవిచ్చినపరకాలుండు మనోహ్లాదంబుచే వైష్ణవధర్మంబులభ్యసించి॥

కందార్థం॥ అక్కారతవాటిల్లగ । చక్రాంకితములునుపంచసంస్కారాది । ప్రక్రియలన్ శుద్ధుండై । చక్రిబదాబ్జములజేర్చెస్వాంతమునందున్॥ దాసత్వముసఫలతనొందన్ - యంతోవేడుకతో శ్రీకాంతుపదార్చన - మంతనమునతిరుమంత్రధ్యానమునిల్పె - స్వాంతము నందున్॥

కందార్థం॥ తిరుమణితిరుచూర్ణంబులు । మురిపంబునద్వాదశోర్ధ్వపుండ్రంబులుమై । ధరియించియుతిరుమంత్రము । నగుమగజపియించసాగెహరిహరియనుచున్ ॥ నిరుపమభక్తినిపుణాతగనుచున్ - పరమానురాగసంభరితుడైగళమూన - వరతులశిమాలలుధరియించిభక్తితో - హరిహరియనుచున్॥ నిరుపమభక్తినిపుణాతొగనుచున్॥

సంధి॥ వ॥ యిట్లుతిరువడయూరు నంబియనుగ్రహంబున నీలుండు నిరుపమానపరమవైష్ణవధర్మంబులంగీకరించినంబిచేయనుజ్ఞవడసి తిరిగి తిరువాంగూరుప్రవేసించి నారాయణాచార్యుల గృహంబునకుజని కుముదవల్లినిగనుగొని వైష్ణవధర్మంబులెరుంగించిన లలనాజనము తల్లియగు కుముదవల్లి తనమనంబునన్నిట్లనివితర్కించె॥

క॥ అరుదందికుముదవల్లీ । సరసిజముఖియాత్మలోవిచారణపరయై । కరి
వరదునికు నమునిడి । హరిహరియిక నేము పాయమనితలపోశె॥

దరువు - ఘంటారవం - రాగం.

యేమి సేతూ నే యోచలయా - యేమియుపమాదో చాదాయా॥ నేమి
సేతూ॥ ప॥ పట్టిస్త్రీభ్రమలాజందినాడు - గట్టిగా జెప్పినావినడూ - దిట్ట
తనముబూనీనాడు - కట్టుమాయాలా చేపోడూ॥ యేమి॥ ౧॥
యేమనిబోంకూదు నేను - వేమారునీమహిలోపలను- నామనోభీష్టం
బుగాను - నీమ మెద్ది సేతూనికను॥ యేమి సేతూ॥ ౨॥
తల్లిదండ్రులర్థమునకూ - మెల్లా గానోడా బాడుటాకూ - యుల్లాము
ఝల్లనేనాకూ - కల్లాగాదూ యీ వేళాకు॥ యేమి సేతు॥ ౩॥
కులగోత్రాహీనూడువీడు - చలమూబూనీవచ్చినాడూ । వలదుస్నా
మ్యానంకట్టెవినడూ - బలిమి చేమూఖిణంచినాడూ॥ యేమి॥ ౪॥
రామావినులక్ష్మణాదాసా - నామపోషాణావిలాసా । స్వామిసీతా
పతిపురవాసా - రామూలా నా యేమూ భాసా॥ యేమి సేతూ నే॥ ౫॥

సంధి॥ యీరీతి కుముదవల్లి నాంచారు మనంబునపరితపించి చింతాక్రాం
తయైయిట్లనియె॥

ద్వి॥ యేమి సేయుదునింక - నెద్దియుపాయ - మేమాట చెప్పిన నెడపక
సేయు - చున్నాడు మిక్కిలిసురచిరభక్తి - క్రన్ననవైష్ణవకైంకర్యమెల్ల -
గావునసాధ్యంబుగానికార్యంబు - వేవేగయోచించివివరింపవలయు- నని
యాత్మనూహించినయ్యిందువదన - పనిబూనిపలికెనుపరకాలుతోడ - వ
స్త్రీభ్రాంతులజెందవలమునీవిపుడు - గట్టిగావ్రతమింక - గలదొకటియు
ను - ధరణిలక్ష్మణదాసుధన్యునిజేయు - ధరణిజాతిపుపురధాముడౌ శౌరి
రుణబూనియువిష్ణుకైంకర్యవిధులు- నెరవేర్చివచ్చిన నేనువరింతు॥
॥ సం॥ ఓపరకాలుడా॥
॥ యేమికుముదవల్లి॥

కు॥ నాకు యింకొక వకవ్రతముగలదు అది నెరవేర్చితివేని నీమనోభీష్టసిద్ధిక ల్గగలదు॥

నీ॥ మహాత్మంచిది కుముదవల్లి ఆవ్రతంబెటువంటిదో ఆనతివ్వవలయు సాధించివరించెదా॥

కుముదవల్లి నాంచారు నీలునిఉత్తర ప్రత్యుత్తరములుగాలలు॥

కు॥ శ్రీరాజితమీతిరువల్లెమునా - శౌరితిరుమంత్రము మోదమునా - నారూఢిగా నాటీయున్నాదా - నిరుపాముధీరా - సారేకునేసురకయున్నారా॥౧॥

నీ॥ నారాయణమంత్రాము నేను - కోరిగురుకారుణ్యమునను - నేరుపుతో నిలిపియున్నాను - స్వాంతాము నాను - తోరమైన భయభక్తులతోను॥౨॥

కు॥ పరమాభాగవతకైంకర్యా - పరతానిరతామును నాచార్య - తిరువడిఘల్ గనిశరణామంటీవా- యోనీలాహ్వాయ - పరతత్వాను భవమూగంటీవా॥౩॥

నీ॥ నిరతాము నాచార్యవరు- తిరువడిఘలెమదివేమారు - మరువకానేనమ్మియుంటీని -శరణంటీని- పరతత్వానూభవము గంటీని॥౪॥

కు॥ అడియేనికితిరువారాధనలు- కడుభక్తితోసల్పావలయు - నుడుగాక సంతతముహితమూని- రాగాముమాని- అడియేదాసుల చిహ్నాలుబూని॥౫॥

నీ॥ తడయాకను నేర్పడరా నేనూ - నడియేదాసునయ్యున్నాను-యడుగనిసందేహామికమాను - వెయ్యాలనేను - కడగి యారాధన జేసేదాను॥౬॥

కు॥ కైంకర్యామింకొకటీదినము - వెంకాయయంతాసున్నాము- కొంకకాతాంబూలములకిమ్మూ- వైష్ణవతతికి- యింకానొక యేడొనరించిరమ్ము॥౭॥

సీ॥ ధరలక్ష్మణదాసూ నేలు - వరసీతారామాపురీశు - కరుణ బూనివె
నరించెదనేనూ-నేరూపుతోను - నెరవేరీచియరుదెంచెదనేనూ॥

కు॥ ఓపరకాలుడా॥

వ॥ యేమికుముదవల్లి॥

కు॥ ఒకసంవత్సరపర్యంతంబు నిత్యముతేంగాయంత సున్నము వైష్ణః తదీయారాధన తాంబూలంబున వ్రయంబుజేసి వ్రతసాంగంబుచేసి వచ్చిన నీకోరిక సఫలంబగు నీలనామధేయ॥

వ॥ మహామంచిదికుముదవల్లిఅదేరీతిజేసివచ్చెదను॥

సంధి॥ యీరీతిలోకజననియగుకుముదవల్లి సాంచారు నీలునికృతార్థుణాం జాయదలంచి వైష్ణవకైంకర్యంబున విత్తాపహారంబై మోక్షమార్గణాంబు సిద్ధించగలదని కైంకర్యంబునియమించి చప్పినపరకాలుండు మోహపాశంబున బద్ధుడయ్యుకైంకర్యంబు నెరవేర్చెదనని కుముద వల్లి యనుజ్ఞవడసి వాలిపురంబు జారంజని॥

క॥ అంతటనాపరకాలుం। డెంతయు మోదంబుతోడ నింటికిజని। ధీమంతుండయ్యెనరించె శ్రీ। కాంతునికర్పణముగాగ కైంకర్యవిధుల్॥

వ॥ యిట్లుపరకాలుండు పరమోత్సాహభరితాంతరంగుండై నిరంతర పరమభాగవతకైంకర్యంబు సల్పు క్రమంబెట్టిదనినా॥

ద్వి॥ సన్నబియ్యంబుప్రసాదంబుతోడ - వన్నెకెక్కిన పరుపామధు తోడ - కత్తారిపోషిణీఘనమైనవాళై - మెత్తనివల్లారి మెల్లండుతోడ- కరమరుదారబల్ కరియామధులును - బరగినవడతిరు పణ్యారములును- పాలుపారనిడ్డెనల్ పులిహోర మోరు - నలరుషరరతికణ్ణామధు తైరు - సద్యోఘృతంబులుసరవికొళంబు - దధ్యోదనంబులు దగుతోపాలిడు - పానకంబులనరటిపనణంబులందు - నానబాలునుపాలు నవనీత ములును - నాదిగాహారితిరువారాధనలును - సాదరంబుగసల్పు సన్మోదమునను - అడియడొలక్ష్మణుకానందమొసగు - పుడమిసీతారామ పుర హరికరుణ॥

వ॥ ఇట్లుదినంబును వైష్ణవకైంకర్యంబు సల్ప దినదినప్రవర్ధమానంబగు పరమభాగవతకైంకర్యవిధానంబున కర్థమంతయు వ్రయంబునొంది చోళరాజుకు ప్రతిసంవత్సరం బొసగునప్పనంబొప్పింపమి దెప్పరంబనక చొప్పుడప్పించిన నప్పుడమి రేడుచెప్ప రాని కోపాటోపంబున చండశాసనులగు దండధరులరావించియిట్లనియె॥

చోళరాజు వాక్యం॥

పంచచామరం॥ భళీశ జానుమేలుమేలుబాగటంచు సద్భటా। వళిన్ గురించి పల్కె మీరుబాహుదర్పమొప్పనా। ఖలున్ మదాంధుపాశబద్ధు గాగజేసిమద్ధనా। వళుల్ బిరాన తెండుపాండవక్రవిక్ర మంబుగన్॥

రా॥ మాట- ఓభటులారమీరలవారిత త్వరితన్ బరకాలుని నొద్దికిజనికట్టిజేసి వాస్తవ్యమగు కిస్తుపైకము దెండి దండనాయకులారా॥

భ॥ మహాప్రసాదంచోళరాజాహ్వాయ॥

కందార్థం.

అటులానతిచ్చిపనిచిన। చటులతరభ్రుకుటియుగళసంరంభితులై। పటుహేతిస్ఫుటరోచిః। పటలాంచితపాణులగుచు - భటులారుదేరన్ - వేవేగమే- పరుపాతమీరన్॥ కటములదరగనుత్కటరోషభీషణ చ్ఛటులచెన్నలర దిక్తటమూలుబగులగ॥భటులారుదేరన్॥

వ॥ యారీతిచోళరాజు సేనానాయకులు పరకాలుండాశి రోషభీషణాకారులైపొడవిననొదవిన రోషావేశంబున నామన్నెధోర వెన్నికక్రన్ననకాళ బిగించి కోపంబురూపంబుదాల్చినక్రైవడి కుటిలభ్రూకుటి యుగళుండగుచు రూక్షేక్షణంబుల నిప్పులప్పలుప్పతిల చండకాండ కాండాసనాది సాధనంబుల ధరించి పటుతరార్భటసముత్కటులగుచు చోళ భూపాలుభటులపయింగవిశి॥

ఉ॥ కొందరనొదలల్లునిమికొందరప్రకట్లు ప్రకట్జేసియున్। కొందరబాహువుల్ నరికికొందరడొకట్లు లుసించిమించితా। నందరకన్నిరూపులయినట్లుగనందరబిలుట్లు మార్చినన్। కొందరప్రాణభీతినటకున్ జనిచెల్పిరిజాడలన్నియున్॥

ఉ॥ అంతటచోళరాజునిలయాంతకుఁడై వడి రోషసంయుత । స్వాంతముతోడఁ గన్నుఁగవ సారెకునగ్నికణంబులొల్కఁ-నే । డంతకుచంతకుఁ బనుతు నాతని వేచనియంచు దలంచి తా । దంతితురంగసద్భటశతాంగము హేళా గ్రచమూసమేతుఁడై॥

వ॥ యిట్లు చతురంగబలంబులతో బయిలువెడలికడలిని కోలాహలముగ పంబున పరుష భాషణ నిరతుండగుచుపరకాలుంగదసి॥

ఉ॥ చాపముకేలబూని పటు శాతశరంబుల ముంచిరంతబల్ । క్రోవ మెలపన్ నీలుడునకుంతితవిక్రమమొప్పననిట్టులన్ । రూపర జేసినన్ గినిశిరూక్షుతదుర్బలుడైనరేంద్రుడా । రాపరకాల మేలనీతిరంబగుకోపముతోడ తోడుతన్॥

మ॥ పటుకోదండకళాకలాపయుతుడై ప్రాగల్భ్య మొప్పంగవి । స్ఫుటటంకారముతోడ నారిమొరయన్ జంఘానుపుంఖంబుగా । కుటిలభ్రూకుటిరేఖతోడబర వెన్ క్రూరాస్త్రజాలంబులు। తఁటవేగంబున నేయ గాంచి తిరుమంగయ్యాళువారిట్లయ్యెడన్॥

చ॥ ప్రకటితశౌర్యధుర్యతశరావళి-వావిరిద్రుంచి సైనిక । ప్రకరము గండడంచిరణపాటవ మొప్పనతిప్రచండసా । యకముల కేతుసూతుతురగావళిద్రుంచిన సంచలించి తా । వికలిత సాధనుండగుచు వేసరి దాసరి తోడనిట్లనెన్॥

గీ॥ నీకుమాకునురణమేలనీలనామ । చాలునింతియె మేలాయ జావకునుట । మేరగాదికవినుము సరాజరూపయిక । మిచ్చిశుభములు వడయుముమచ్చికలరా॥

క॥ అనిచోళరాజుబలికిన । వినిపరకాలుండుచాల వినయముతోడన్। పనిబూని జేసెదనునీ । పనుపనిపనివినియెనతడు పరమోత్సుకతన్॥

వ॥ యారీతిచోళరాజుభాషించిననీలుండు రాజాజ్ఞ శిరసావహించి చోళరాజు వెంటచోళనగరంబు ప్రవేశించినచోళరాజు మంత్రినిరావించి ...లునివప్పగించి రావలసినద్రవ్యంబుతీసుకునివిడువవలయునని ఆజ్ఞయిచ్చిన ...దనంతరంబా॥

సుగంధివృత్తం ॥ చోళరాజు మంత్రియంత శూన్యనాడమైనదే । వాలయంబులోననుంచెవాశిడిందిసుందియా । నీలుమండిమూడునాళ్లు నిద్రతోడవేడెనా । నీలవారివాహదేహనీరజాక్షుయెంచెదన్ ॥

సుగంధివృత్తం ॥ భారతీశదానవారిభావనాశ్రితాపనా । హారణావనార్థనక్రభంజనానిరంజనా । భూరివైరిబాహుగర్వమోచనాబ్జలోచనా। మారకోటిరూపకంసమర్దనాజనార్దనా॥

కందార్థం.

అని మొరలిడి కారాగృహ । మునని(ద్రింపంగస్వప్నమునశీఘ్రమునన్ । జనుదెంచివరదరాజులు । ఘనరవమునానతిచ్చె॥కడు కృపతోడన్ । పురాకృతకర్మములీడన్ ॥ తడయక నీకు నేనడిగినధనమిత్తు- పృడమి వెలయు కాంచిపురికిరమ్మనిపలికె । కడుకృపతోడన్॥

కందార్థం.

అంతటమేల్కాంచిమదిన్ । సంతసమున బొందలిసుభటసమితిన్ గనిమీ। రింతటకంచికివచ్చిన। నంతయుధన మిత్తుమీకు । నచ్చట ననియెన్ । నాతో రండు - ముచ్చటలెనయన్ - మచ్చిక నాచోళమహీపతి యనుమతి । చెచ్చెరకాంచీకిజేరెకావలితోడ । నచ్చటననియెన్॥

క ॥ అటచనినీలుడుకాంచీ । పుటభేదనమెల్ల వెదకి భూరిధనంబె । చ్చటగానక వేసరిలంపటమొందుచు । బహువిధముల బ్రార్థించెహరిన్॥

వ ॥ యీరీతిపరకాలుండు నాల్గుదినంబులు తానుకారాగృహంబున నుండు కారణంబున వైష్ణవకైంకర్యం బేమాయెనో యని పరితపించుచు స్వప్నంబునయానతిచ్చిన వాక్యంబునిజంబుగానిక తనమనంబు ననిట్లనిస్తుతియించె॥

వరదరాజస్తవం.

భుజంగప్రయాతం ॥ పరాకేలవాదా ప్రపన్నానుమోదా। పరంధామనర్త్యేశభక్తప్రసాదా । కరిన్గావలేదా కటాక్షింపరాదా। సరోజోద్భవారాధ్యసత్తీర్థపాదా॥

దర్వు - ఆరభిరాగం.

నిన్నేనమ్మినారానే - నిరుపమలోకాధారా - వనజలోచననామనసు కెంతోరెకలీడేరా॥ని న్నే॥

నిగమవిహారామా - నితశోభనాకారా - ఖగకులపతిసంచారా - ఝగణితమణికోటీరా॥ నిన్నే॥౧॥

మొరలిడలేదా నే - శరణాని వేడలేదా - హరిహరినీవే నా - దొరవ నాకరుణారాదా॥నిన్నే॥౨॥

గతినీవేయంటినే - నితజులవేడనంట్టి - పతితుని బ్రోవుమహూర్తితము లెన్నావద్దంట్టినే॥ నిన్నే॥౩॥

దాసుడగానా - నిన్నేసదామిఠిలోమానా - నీసరిధోరనేగానా - వేసరితిజగతిలోనా॥నిన్నే॥౪॥

వేమారుసీతారామనగరవిఖ్యాతా - ధామలక్ష్మణనేతా - కామిత ఫలసంధాతా॥ నిన్నే॥౫॥

భుజంగప్రయాతం॥ మొరాలింపవేరా ముదంబందరారా। పురారాతిహేతి ప్రఫూతప్రకారా। నరాదప్రపారానమస్సద్విచారా। సరోజాంఘ్రువైకుంఠసత్యానుసారా॥

వ॥ యివ్విధంబునపరకాలుండు మొరలిడిన వరదరాజులరమురలేని కరుణాభారంబున తదియ్యస్వప్నంబున దర్శనంబిచ్చుక్రమంబెట్టిదనినా॥



సీసాధరం॥ శ్రీరమణీయ్యశృంగారచిహ్నాలతోడ ప్రకటితతులసిమాలికలతోడ। మెరయప్రావృణ్ణనమేచకాంగముతోడతటిదాభసౌవర్ణపటముతోడ। కటకకోటీరాదిచటులభూషలతోడ సహజశ్రీవత్సవక్షుంబు

తోడ। శంఖచక్రగదాదిసాధనంబులతోడ చందనఘనసారచర్చ తోడ।స లలితోదార కరుణారసంబుతోడ। సరసగంభీరమందహాసంబుతోడ।స్వ ప్నమందునగరుణసాక్షాత్కరించె॥ కంచివరదుడు నీలు - నకంచితముగా- కనుపించిధనము - చాలాగనిత్తువేగా - కాలావిడంబాము నేలావేగావ తి - కూలమునందునాన - వాలుగగొనుమని - నీలునకంచితముగా - కను పించిధనము చాలగానిత్తు వేగా॥

వ॥ యీరీతిస్వప్నంబున వరదరాజులు వేగవతీతీరంబున వాలుతల్పి న ధనంబుదొరుకునని వరంబులొసగిన మేల్కాంచి నీలుండు పరమానం దభరితుండై॥

క॥ అంతటనాపర కాలుడు। స్వాంతంబునబొంగిధనమువారికగొని। భూ కాంతునికిస్తులపయికం। బింతయునప్పించెనపుడుభటతతిచేత॥

వ॥ యీరీతినీలుండు సర్కారుకిస్తుల పయికంబంతయుభటులచేపం పిన చోళరాజుభటులచే తద్వృత్తాంతంబంతయునెరింగి భగవద్భక్తుం డనినిశ్చయించి చనుదెంచి పర కాలునకిట్లనియె॥

దర్వు - శుద్ధకాంభోదిరాగం - రూపకతాళం.

అపరాధములొనరించితికృపణుడనై నేడూ- నెపమెన్నకునీలాహ్వాయ నిపుణుడకృపజూడు॥ప॥

కిస్తీపయికముదెమ్మనికృత్తిమమతితోను - కస్తిచెయించితినినుఘనుడ నియరుగకను॥ అపరాధము॥ ౧॥

జడుడను తామసుడనుమూర్ఖుడనే కఠినుడను - పుడమినీసరిమా హాత్ముడు లేడరయగను॥అప॥ ౨॥

ధరలక్ష్మణదాసాహ్వయపరిపాలకుడైనా - వరసీతారామపురీశ్వరు చరణములానా॥అప॥ ౩॥

వ॥ యీరీతిచోళరాజుప్రార్థించి క్రన్నన నమస్కరించి ధీర నెన్నరాని మన్ననచేసి కిస్తులపయికంబు వైష్ణవకైంకర్యంబున తేవలయునని మర లనిచ్చిన నీలుండుసంతసించి చోళరాజుయనుజ్ఞవడసి వాలిపురంబుజేరం

జని షణ్మాసపరియంతంబు వ్రతలోపంబుగాకుండ ప్రతిదినంబు వైష్ణవకైంకర్యంబుసలుపుచున్న కంచిలోదొరికినధనంబు స్వగృహంబునగల వస్త్రద్రవ్యాదులు వైష్ణవకైంకర్యంబునకు చాలకయున్న మనంబునన్నిట్లని తలంచె॥

కందార్థం॥ ధరలోనరులై పుట్టిన । పరమార్థముదలచిచూడ భాగవతసముత్కరకైంకర్యమెఫలమని । స్థిరముగదలపోశెతనదుచిత్తాములోనన్॥ భావించియేవృత్తినైనన్ - అత్తారికంచీలోనచ్చినమితిలేని। విత్తాముకైంకర్యవిధులాకుసరిపోవె - చిత్తాములోనన్॥

వ॥ పరకాలుండు భగవద్భాగవతకైంకర్యంబునకు ద్రవ్యంబుసంపాదించునుపాయంబు చోరత్వంబునగాని నెరవేరదని మనంబున యిట్లని తలంచె॥

ద్వి॥ అనియిట్లతలపోశిఆత్మలోపలాను-తనుచాయకనుగొల్చుదండనాయకులును - గురిగింజమల్లడుగువ్వలెల్లడును- యరుకలగోపడుయగ్రచాపడును - శింబోతుశింగడుచంచువోబడూను - నంబూరిలింగడునల్లరంగడూను - పోతులరాముడుపులిగోళ్ళవీరా - కోతులతిమ్మడు కోరెందఝట్టి - గొంగడిపుల్లనకొండలసింగ। దొంగలభీముడుతొట్రిసోముడూను- పుచ్చకాయలబొగ్రభూపతినగ్ర - పచ్చాకునరిసింగపాలెపులింగ - గట్లచీరడుతలకట్లశరభడూను - పొట్లాకుబుచ్చనపుట్లకిచ్చడును - చీమలకన్నడుచీమలగున్న - చామభీముడు మొదల్ సకలనాయకులు - తడయకలక్ష్మణదాసునిబ్రోచు - పుడమిసీతారామపురహరిదలచి - తనుగొల్చినడువంగధైర్యంబుతోడ - ననువొందశౌర్యక్రియారతుండగుచు॥

చరితకందార్థం॥ డాలుతలవాలుబల్లెము । శూలంబుశరాసనంబు సునిశితశరముల్ । కేలధరించిదినంబున । వాలాయము దిరుగుచున్న వారణలీలన్॥ శస్త్రాస్త్రములుదారతగ్రాలన్ - ధీరూఢై ఘోరకాంతారామందశ్వద్ధ - ధారూణిజముచెంతదసాగా మెలపాగ - దారినటిం

చేటివారినెల్లనుక్ర్యారుడై యరికట్టిధనమువ్వారిగా దోచుకొని శౌర్యక్రియారతుండై భటలగూడుక - నవారణలీలన్ - శస్త్రాస్త్రములు దారతగ్రాలన్॥

కందార్థం॥ యీసరణిపొంథలోక । ప్రాసదక్ర్యారప్రచారదతుతచోరా । గ్రేసరుడై వైష్ణవజన । దాసుండై ధనము లేమి తనచిత్తామునన్॥ భావించెరంగని మోదమునన్ - వనజలోచనజనార్దనవాసుదేవహా - వనచెరితమాని భావనయాని ధ్యానించె - చిత్తాములోనన్- భావించెరంగని మోదామునన్॥




శ్రీరంగనాయక స్తవం - తేవారాలు.

నిత్యసత్యానులాపా - నిరుపమానమణికలాపా - అత్యుదార ప్రతాపా - అనుపమేయజలదరూపా॥౧॥

దేవతాసార్వభౌమా - దినకరాయుతశతధామా - కేవలానంతనమా - కితవదైత్యభటవిరామా॥౨॥
పన్నగాధీశశయనా - పటతరాబ్జమిహిరనయనా - పన్నగారాతిగమనా ప్రణుతఘోరదురితశమనా॥౩॥

వ॥ యీరీతిపరకాలుండు వైష్ణవకైంకర్యంబునకు యాంశుద్వయంబై వకపదార్థంబైనా వనగూడక పరితపించుచు భాటసరివారు రానికారణంబున శ్రీవైష్ణవజనంబు ప్రతిదినక్రమంబుపవాసంబు నీలునిద్వారంబు నకలివియుండిన నీలుండుద్రవ్యంబులేమిం జేసి వ్రతభంగంబౌనని భీతిజెంది పరమభాగవత తదియ్యారాధనాయత్తచిత్తుండై వైష్ణవకైంకర్యలోపంబు సేయుటకన్న జన్మంబు శ్రీరంగధామునికర్పించుట పరమధర్మంబని మనోనిశ్చయంబుజేసి సాహసంబున వాడిగలశూలంబు నేలంబాతి దాని వుపరిభాగంబుననుండెడు నశ్వద్ధవిటపంబునంగూర్చుండి శ్రీరంగధ్యానంబు సేయుచు శూలంబుమీద ధుముకగమకించుసమయంబున శ్రీమన్నారాయణుండు భక్తపరాధీనుండు గావున కరుణాకటాక్షవీక్షణంబున నీలుని వైష్ణవకైంకర్యమనోదృఢంబునకు మెచ్చి రక్షించందలంచి శిరిసహితంబుగా పెండ్లికొడుకు పెండ్లికూతురు వేషంబులుధరించి అమూల్యాభరణంబుశృంగారించి నీలుండు వసియించియున్న కాంతారమార్గంబు బూని॥

దరువు - శహనారాగం.

తరలీరివేడ్కమీర - కరుణాస్వాంతములతోడ - తరలీరి॥ ప॥ ఉ॥
పరమకళ్యాణమూర్తి హరియును శిరియుగూడి॥తర॥
పచ్చానిపస్సువన్నె బంగారుపటము బొప్పు - పచ్చాలపతకమూలువశిడిమొలనూలు మెరయ॥తర॥౧॥
తారాహారంబులూను దనరుప్రాదండలూశృం - గారంబుగుల్కగాను - కల్యాణవేషముతోను॥తర॥౨॥
గరిమలక్ష్మణదాసునరమురలేకబ్రోచు - ధరణిసీతాభిరామ పురధాముతెరలగాను॥ తర॥౩॥

సీ॥ తాటంకయుగరత్నధగధగాయతరుచుల్ గండభాగంబులగడలు కొనగ। పసమించుపచ్చలపాపటచేర్చుఁకర్కి నిటలదేశంబుననటనమాడ। చటలమణిప్రభావటలాంచితములైన రాకడిశశిరేఖరహిజలంగ। హారంపుపతకముల్ తారహారంబులు వక్షోజయుగముపైవన్నెగులుక। కటకమంజీరమేఖలాపటరవముల। నవిరళస్థితిచవులపండువులుసేయ। రంగుబంగారుచీరగ్రాలంగవచ్చె। కలభసుందరగమనమైకలిమిచెలువా॥

వ॥ మరియును శ్రీరంగనాయకులు పెండ్లికొడుకు వేషంబు బూనివచ్చుక్రమంబెట్టిదనినా॥

సీ॥హారకోటీరకేయూరాదిదీధితుల్ దిక్కులయందెల్లపిక్కటిల్లులలితలావణ్యనీలాంగసౌందర్యంబుమేచకాభ్రంబును మేలమాడ। నిండుపున్నమచంద్రునీటుగు లెక్కటిముద్దుమోమునచిరునవ్వుమొలుకలొత్త। పసపునిగ్గులుగులుకుబంగారువలెవాటమూపుపైపలుమారుబొదలియాడ। వేడుకలరగకల్యాణవేషమమర। పరమకారుణ్యరసమొలుకుపద్మతోడ। తరలెనయ్యెడఘోరకాంతారశీమ। వెన్నుడప్పుడువైష్ణవేషియగుచు॥

ద్వి॥ యీరీతివధువరులింపొందుచుండ - నారూఢిగావైష్ణవాభర్ణకులగుచు- పచ్చనివస్త్రముల్ పరగంగదాల్చి - పచ్చవిల్తునితల్లిపద్మనాభుండు - మచ్చికపరకాలుమన్నించదలచి - హెచ్చుభూషణములు నెలమిగ్రాలంగ - కస్తూరితిలకంబు ఘనసారచెచఁ - వస్తువుల్ ఘుమఘుమవాశింపుచుండ - సంపెంగపువ్వులసరములుదాల్చి - యింపుగావనమునకేతెంచిరపుడు - కడువేడ్కలక్ష్మిణుకరుణతోబ్రోచు- పుడమిసీతారామపురహరిమెచ్చ॥

సంధివ॥ యీరీతిశ్రీరంగనాయకుండు రంగనాయకిసహితంబుగాదంపతివేషంబులు ధరించి బాలులపగిది మార్గంబునరయుచు నలుదిక్కులజూచుచు నశ్వత్థవిటపంబుసమీపంబునకు వచ్చుచున్న పరకాలుండు మరణోద్యోగంబు నిశ్చయించి వృక్షంబుపైనుంట శూలంబుమీదధుమకగమకించి నలుదిక్కులజూచిన నెట్టెకేలకు పూర్వభాగంబున నొకవైష్ణ

వపెండ్లికూతురు పెండ్లికొడుకు లిరువురు ననేకదివ్యాభరణ యుక్తులై మార్గంబున వచ్చుచున్న వారలంగని పరమభాగవతోత్తముండుమదనోద్యోగంబుసాలించి వృక్షుందిగిబలంబులగూర్చుకొని వధువరులసమీపంబునకు వొచ్చి - చుట్టుముట్టడి వేశి - సర్వాభరణంబులపహరింపనుద్యోగించుసమయంబున శ్రీహరిపరకాలునితో నిట్లనియె॥

క॥ నీవెవ్వడనీయడవిని । త్రోవకాజనువారి నేల దురుసు తనముననా ।
వేవేగమెయరికట్టెదు । నీవర్తనమెల్లజపుము నిజముగనననా ॥

మం॥ అహహా సేనానాయకులారా॥

సే॥ యేమిమన్నెసుల్తాను॥

మం॥యీదిన్నివైష్ణవ బాలులుఅపహాశ్యముగా నాతో మాట్లాడుట హాశ్చర్యకరంబు॥

సే॥ ఓరాజాగ్రణి యీమికారుమంచిది దొరికినది యీవుభయులఆభరణంబులపహరించితె నీవ్రతసాంగంబగు గావున కాలవిడంబంబుశాయవలదు వైష్ణవసంఘుంబుపవాసంబున ఘోషింపుచున్నారు గావున శైంకర్యంబునకాలశ్యంబు తగదు మన్నెధొర॥

నీ॥ అయి తేభటులారా మీరు చుట్టుముట్టడి వేశి పహరావుండవలయు నేను వుభయులాభరణవస్త్రాపహారంబు జేసేదనని పెండ్లికొడుకుతో కోపాటోపంబునపరకాలుండిట్లనియె॥

దరు॥శూరుడరారణధీరుడరా దండి చోరులకెల్లసరు దారుడరా॥ప॥
పెడ బొబ్బలిడునట్టి పెద్దపులులబట్టి కడగిగిటణగించుచును దానురా॥
శూరు॥౧॥

మదగజంబులబట్టిమదమాణగించూచు బెదరాక తిరిగేటి ధీరుడరా॥
శూరు॥౨॥

కొండగృహములనుండుదండిసింగములాను చండాడుజగదేక ఝట్టిని
రా॥శూరు॥౩॥

పొంకాకస్మృగమూలబింకాములణగించి శంకలేకతిరుగు జాణుడరా॥
శూరు॥౪॥

దండివైరులకెల్ల గుండెలుఝల్లన చండవిక్రమమూన నుండెదరా॥
శూరు॥౫॥

బింకాముతోమన్నెబిరుదుదాల్చిసకల సుంకాముగొనియేటి సుజనూ
డరా॥శూరు॥౬॥

భాటసారులద్రోచిభాగవతకైంకర్యపాటవంబున మెరయుభక్తుడరా॥
శూరు॥౭॥

కోటిమాటలేల సాటిలేదునాకు సూటీగాతస్కర శూరుడరా॥౮॥

పరగలక్ష్మణదాసావనుడుసీతారామ పురశౌరిపదమూలె పూజింతు
రా॥శూరు॥౯॥

సీసార్ధం॥ హరియునుశిరియుకల్యాణవేషములల వడజనుదేరనశ్వత్థవిటపి।
పొంతమెల్లైనపొంచిపొంగియాతిరుమంగయాళ్వారు పుటఖడ్గహస్తుడ
గుచు । తారసిల్లియనేకతర్జనాలాపసందష్టాధరుండయ్యెతడయిక
పుడు । వారిసొమ్ములుసర్వస్వమ్మపహరించి ముల్లెలుగట్టెత్తబోవనవి
యు । కదలకున్ననిదేమియాగడముయనుచు । శ్రీవరునితోడ తస్కర
శేఖరుండు। బాపడామేల్ శబాసుటం చప్పరాని । కోపమున బలెక్
నప్పుడాకుంటితమూగ - నీమంత్రమూలదిప్పువిప్పుడువేగా- వప్పావి
గనీమూటాలుతెప్పానలేవకున్న - తప్పాకనీకుగలుగు దెప్పారమను
చుబలెక్ - నప్పుడాపంతితమూగ - నీమంత్రాములద్రిప్పు విప్పుడు
వేగా॥

వ॥సం॥యీరీతిభాషించిన లక్ష్మీదేవి లోకజననిగావున పుత్ర వాత్స
ల్యతదనర పరకాలుండుజేసినదోషంబు పాదంబులకు వందనంబుశా
య నిదిరహితంబుగాదని శిరిదేవిపదచలనంబు జేసిన పరకాలుండు
లోకజనని పాదంబులజూచి కాలిమట్టియలువిడువ కారణంబేమనితి
య్యనుద్యోగించి॥

కందార్థం.

శిరిదేవికాలిమట్టెలు| పరికింపగరాకయున్న పట్టెగరువన్ | సిరిగనుగొనియప్పుడుతా । పరకాలునకనియెనేమి । ఫలమాగు దీనిన్ । పెంపుగనీలుండనెలలనామాని । వలనొప్పనిదియొకట- వైష్ణవకైంకర్యములకు చాలదెయనలలి మెచ్చియవియిచ్చె॥ ఫలమాగుదీనిన్॥

వ॥ యీరీతిమాత్రుపాదాక్రాంతుండై అనుగ్రహంబు వడసి పెండ్లికొడుకుహస్తంబుజూచి హస్తస్పర్శనంబునగాని దురితనివారణంబు గాదని శ్రీమన్నారాయణుండు కృపాకటాక్షవీక్షణంబున శిరిదేవి మట్టెలేలదీసెదవని హస్తంబు జాచిన పరకాలుండుశ్రీమన్నారాయణుహస్తముద్రికనపహరించదలంచి॥

కందార్థం.

శ్రీలలనాపతిముద్రిక । వాలాయమురామిద్రేలువడిగోయగతా । బాలుబెరుకంగహరియనె । నేలాయిదినీకటంచు।నీలునితోడన్- తానిట్లానెనిటుహరితోడన్ - చాలాదెయొకట- వైష్ణవుతాంబూలముమనాకు॥ చాలాపములుశేయనదియిచ్చెయనెశౌరి॥ నీలునితోడన్॥

వ॥ యీరీతిపరకాలుండు వైష్ణవకైంకర్య ధురంధరుండై శిరికాళ్లకుమ్రొకిట- శ్రీమన్నారాయణు హస్తస్పర్శనంబు జేసిన మాహాత్మ్యంబున శ్రీమన్నారాయణుండు పరకాలునితోనిట్లనియె॥

దర్వు॥ వినరోరిచోరా - వ్యర్థముదుష్టపనులివి మేరా- ప॥ ఘనముగశ్రీహరికరుణలేకుండిన-జను నేమరితము లెల్లసద్గతిగలుగునె।వినరోరి॥౧॥

పరిపారిగతులా - గుణహీనులై ప్రబలుదుష్కృతులా - పరదారగమనాముపరద్రవ్యహరణముస్థిరముగజేసిననరకాముజెందునా॥ వినరోరి॥౨

విప్రావీగెదరు - శోణితమూల - బుద్రాను కెరాదు - వెర్రివానివలె విచ్చాలవిడిగాను - తొగ్రులవలెవట్టితో వాలనడిచేరు॥విన॥౩॥

చుట్టాలుసుతులు - పాత్రులుతోడ - బుట్టుట సతులు - అట్టె కాలునిదూతలిట్టట్టుబాధింప - వట్టిమాటలెకాని వారడ్డపడబోరు॥ వినరోరి॥ ౪॥

అరమర లేలా - ఆచార్యుల - గురు తెరుగుచాలా - పరగలక్ష్మణ దా సుపాలించుఘోరమైన - ధరసీతాపతిపురహరి నే నేజూడర ॥ వినరోరి చోరా - వ్యర్థముదుష్టపనులీదిమేరా॥౫॥

వ॥ యివ్విధంబునపరకాలునకుహితంబులు జెప్పియర్జునసారథిపరకాలుని వైష్ణవకైంకర్యమునూదృఢభక్తికిమెచ్చి మచ్చిక లలర చోరాగ్రేసరునకు నిజస్వరూపంబుదాల్చి దర్శనం బొసంగిన శ్రీమన్నారాయణుని జస్వరూపప్రభావంబు జూచి నేత్రంబులనానందబాష్పంబులుగురియ కరములు మొగిడిచియిట్లని స్తుతియించె॥

పరకాలునిచూర్ణిక.

శ్రీమచ్ఛ్వరాచరసంతాన । చాతురీధురీణ । పుండరీకభవాండ కోటి కరండాయమానమానితమహనియ్యతుందం।శ్రీమన్ముకుందం॥౧॥

చతుర్ముఖపంచముఖషణ్ముఖప్రముఖ బహిర్ముఖోత్తమాంగ సంగత రంగతోర్కిటీర కోటిఘటిత పటుతరానర్ఘ్య మణిఘృణీమండల మండిత। పాదారవిందం మోదితమునిబృందం॥౨॥

సంతతనితాంత కాంతికాంత । ప్రావృడ్భవిభ్రమాస్పద కటితటిన టచటుల చంచలాసంచయ సమంచితకమనియ్య తమనియ్య దుకూలం। కరుణాలవాలం॥౩॥

సింజన్మణిపుంజరంజితమంజీరమేఖలా కేయూరహారకోటీరాది భూషణభూషిత లావణ్యగాత్రం దురితలతాలవిత్రం॥ ౪॥

శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గపంచాయుధాదంచిత చతుర్బాహుదండం। పాలితవేదండం॥౫॥

ప్రహ్లాదనారదపరాశరపుండరీకవ్యాసాంబరీష రుక్మాంగదాది పరమభాగవతజేగియ్యమాన శమదమాద్యనంతకళ్యాణ గుణాభి రామం। భవబంధవిరామం॥౬॥

నిరంతరాశ్రితసంతానదురంతసంతాప పరిహార కరణసౌభాగ్య దాయక దయాగుణ శ్రీలాలిత హేలాయుతలక్ష్మీనాయకం। భక్తాభీష్టప్రదాయకం॥ ౭॥

సౌజన్య బంధురసకలకళాధురంధర అనంతాహ్వయ ఫణిరాట్ శ
యానం । శకుం తేశయానం॥౮॥
శ్రీసీతారామనగరసీతారామచంద్రచరణారవింద మరందా స్వాద
నానందమ్మిళిందాయమానమానన తాడిప త్రిలక్ష్మణరాయనామధే
యాభీష్టప్రదాయినం । నిజదాసానుయాయినం॥ ౯॥
భవంతంభగవంతంనమామి॥

వ॥ యీరీతిపరకాలుండు స్తుతియించి శ్రీమన్నారాయణుండు సాద
రంబున హస్తంబుసాచి జేరంజీరి కారుణ్యంబున శ్రీమన్నారాయణాష్టా
క్షరీమంత్రం బుపదేశించితిరుమంగయాళ్వారను నామంబొసంగి పన్నిద్ద
రాళ్వారులలో గణనజెంది కొంతగాలంబు శ్రీరంగంబున భాగవత కైం
కర్యంబుసలుపుచు నివసించియుండి తమపరి మత్సన్నిధానంబున పరమప
దంబున నుండవలయునని వరంబొసంగి యంతర్ధానంబు నొందిన తిరు
మంగయాళ్వారు సకలవ్యాపారంబులుడిగి కామక్రోధ లోభమోహాదు
ల వర్జించి నిస్సంగుడై శ్రీమన్నారాయణాష్టాక్షరీమంత్రంబె జీవనంబు
జన్మపావనంబనితదేక ధ్యానుండై శ్రీరంగంబున కావేరిజలంబుల నిత్య
కృత్యంబులు సల్పుచు రంగనిదర్శనంబు జేయుచు పరమభాగవతకైంక
ర్యతత్పరుండై మనంబుననిట్లనిభజియించె॥

దరు॥ నారాయణుడాచార్యుడయ్యె తిరునామమె నాకికజీవనము। సారె
కువైష్ణవసత్కైంకర్యముసల్పుటజన్మమె పావనము॥ నారా॥
భువనత్రయముస్వదేశంబాయను భూమిజమాకునుజననిసుమీ। పవన
జునేలినభానుకులేశుడుప్రత్యక్షముమాతండ్రి సుమీ॥ నారా॥౧॥
అష్టాక్షరి నాకుపదేశించిరిఅన్యమార్గముల జేరసుమీ । యిష్టులై రిశ్రీవై
ష్ణవులిక నేనితరమతంబుల గోరసుమీ॥ నారా॥ ౨॥

సతతమురంగనిహితవుగనమ్మితి సత్యముసద్గతిజేరెదనూ ॥ పతితపా
వనునిభజనజేయుచునుపరమపదము నేగనియెదను ॥ నారా॥ ౩॥

చక్రశంఖశార్ఙ్గాయుధధరుమదిసంతతమున నేగొలిచెదను । అక్రూరత నేనంతశ్శత్రులననిశముగండడగించెదనూ। నారా॥ ౪॥

ధరసీతాపతిపుర హారికన్నుల పరమోత్సవమున గాంచెదను । మఱియుచులక్ష్మణు నిరతముబ్రోచెటి వరరఘువీరు నుతించెదనూ॥ నారాయణ॥౫॥

వ॥ అంతతిరుమంగయాళ్వారు నిరంతరపరమభాగవత కైంకర్యంబు సల్పుచు ధనముభావంబైన భగవద్ధ్యానంబు జేసిన నోడ బేరంబున ధనంబు రాగలదని స్వప్నంబున వరంబొసంగిన నాగ పురంబుచేరి॥

సీ॥ ఓడబేరములాడునొకవర్తకుండుతా పోకలునోడలోబోసుగొనగ । నొకపోకనడకొత్తునా త్తినసగపాలు నాయోడలోబడనతడు వెతుక। నిపుడేల వెతుకంగనెని త్తుసగపాలుక్రముకంబటంచుతా వ్రాశియివ్వ। నావలిదరి జేరినంతటకలహించియోడించిపోకలు యోడలోని । సగముగొని వైష్ణవో త్తమసమితికెల్ల। ప్రీతికైంకర్యవిధులాచరించుచుండె । దండిగాభాగవతాగ్రేసరుడనంగ । పేరుగల తిరుమంగ యాళ్వారులంతా॥

వ॥ దదనంతరంబా ఓడబేరముచేత నొచ్చిన ద్రవ్యంబు వైష్ణవ కైంకర్యంబునకు చాలక నాగపురంబుపోయి॥

సీ॥ తదనంతరంబునధనములాభంబైనరయ మొప్పనాగపురంబు జేరి। నొక దేవళములోననకలంకసౌవర్ణమయవిగ్రహముగాంచి మహితసాధనంబులగూర్చిక్రన్ననగుడిశిఖరాగ్రకలితయంత్రంబునుదొలగజేసి తత్స్వర్ణవిగ్రహోత్పాటనంబొనరించి ఖండించితత్కనకంబులమ్మి। పొలువుమీరంగశ్రీరంగపురమునకును । చారుతర మగుభూరిప్రాకారములను । గోపురంబులుగట్టించె కుతకమలర। ధీరుడగుతిరుమంగయాళ్వారుఘనుడూ॥

క॥ అనితిరుమంగయ్యాళ్వార్ ఘనచరితము నామహర్షిగణములకును జె।ప్పెను సూతుడు వేడుకతో । భనములు సమకూరుజనులు వ్రాశిచదివినన॥

మంగళహారతి॥

మంగళంసీతానాయకా । శ్రీదాయకా । మంగళంసీతానాయకా ప॥ శృంగారకలితమేచ । కాంగాఖగరాజతు । గంగాఘోరాఘత మిశ్రపతంగాకరుణాంతరంగ॥ మంగళం॥

సామాజారాజాపాలనా । శ్రీహరిపరం । ధామామునిచిత్తాఖెలనా కామాదివినుత శోభననామా భవబన్ధవి। రామా రఘువంశాంబుధి సీమా రవికోటిధామా॥ మంగళం॥౧॥

సారాసాపత్రలోచనా । నిజాశ్రిత । వారాఘోరాధిమోచనా। తారాకనిభముక్తాహారానవరత్నమయ కోటీరనిగమాంత సంచారానగరాజధీరా॥ మంగళం॥౨॥

శ్రీమహితమంజుభాషణా । సనకాదియోగి । ప్రాముఖ్య చిత్తతోషణా। కామితఫలదసీతారామానగరవర । ధామాపాలిత లక్ష్మణనామపరిపూర్ణకామా॥ మంగళంసీతానాయకా॥

శ్లో॥ మంగళంకోసలేంద్రాయ మహనీయ్యగుణాత్మనే।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయమంగళం॥ . . . *

గద్య * ఇతి శ్రీమద్రఘునందన చరణారవింద మరందాస్వాదనానందక మిళిందాయమాన మానస తాడిపర్తి - లక్ష్మణరాయ నామధేయ ప్రణీతంబైన శ్రీతిరుమంగయాళ్వారు చరిత్రంబను యక్షగానంబు సంపూర్ణము.